

రాష్ట్రగవర్నర్ గారికి గోవధ నిషేధానికై చట్టం చేయాలని మెమోరాండం సమర్పిస్తున్న
**శ్రీ జి.పుల్లారెడ్డి - శ్రీగుండేరావు** గార్లు.



**'భారతి'** గ్రంథావిష్కరణ చేస్తున్న నేషనల్ ప్రొఫెసర్ **శ్రీరామరాజు**, వారికుడివైపు
రాష్ట్ర కవి **డా॥.ఓగేటి**, ఎడమ వైపు కళాప్రపూర్ణ **డా॥ పోతుకూచి**, ప్రక్కన రచయిత **పింగళి**



# 'విశ్వహిందు'

సంపుటి : 11 సంచిక : 5 ఈశ్వర – వైశాఖం మే – 1997

ప్రధాన సంపాదకులు :

**ప్రొ. బి. రామరాజు**

సంపాదకులు :

**బింగళి సుందరరావు**

సలహా మండలి :

**శ్రీ పి.వి.యస్.నాయుడు**

**డా. కసిరెడ్డి వెంకటరెడ్డి**

చందా వివరములు

జీవిత సభ్యత్వం రూ. 500.00

వార్షిక చందా – రూ. 50.00

విడిప్రతి – రూ. 5.00

డి.డి.లు **'విశ్వహిందు'**

అని మాత్రమే పంపవలెను.

చిరునామా
'విశ్వహిందు'
4–5–212, ''విజయశ్రీ''
కోఠి, భాగ్యనగర్ – 500 095.
ఫోన్: 517799, 591322.

ఈ సంచికలో .................... పుట



ముఖచిత్రం : రవీంద్రుడు

సంపాదకీయం:

# మళ్ళీ మళ్ళీ... ఎవరుకారణం?

విశ్వకవి రవీంద్రుడు జన్మించిన ఈ భారతావని నాగరికతకు ఆది, అనాది అన్నద సుప్రసిద్ధం. రవీంద్రుని జయంతి యీనెల 5న జరుపుకుంటున్నాము. "Where the mind is without fear......."లాంటి నిర్మలత్వ, నిశ్చలత్వ, నిర్భయత్వతత్త్వాల ప్రపంచమంతా ప్రసరింపజేసిన 'గీతాంజలి' కర్త, నోబుల్ బహుమతి గ్రహీత, విశ్వవిఖ్యా విద్యావేత్తను గన్న యీవేద భూమి, భారతభూమిలో నేటికీ అక్షరాస్యుల శాతం అతిస్వల్ప కాగా, నేటి విద్య 50సం॥ల స్వాతంత్ర్యానంతరం కూడా బ్రిటీషుపాలన నాటి 'పొట్టకూటి విధానంగానే ఉండడం హాస్యాస్పదం... అందునా మొన్నటి ఇంటర్ పరీక్షాపత్రాల లీకే విషయం కొందరు రాష్ట్రవిద్యాధికారుల, విద్యావేత్తల, ప్రైవేటు, ప్రభుత్వ విద్యాసంస్థ అధిపతుల, అధ్యాపకుల నీచాతినీచమైన అవినీతికి నిదర్శనాలు. మళ్ళీమళ్ళీ పరీక్షల బెడద విద్యార్థులకు. తల్లిదండ్రులకు ఆందోళన, అధికవ్యయభయాలు.

''పరీక్షా పత్రాల లీకేజికి కారకులైన దోషులచేతులు, కాళ్ళు నరికివేయాలి'' అన్నద ఓ ఇంటర్‌విద్యార్థి యొక్క ఆగ్రహ ఆవేదన. మరి పరీక్షలలో దౌర్జన్యంతో కాపీలు చే విద్యార్థుల విషయం? అన్నప్పుడు ''వారికి యావజ్జీవ కారాగారశిక్ష'' అంటాడావిద్యా మరి....

దైవము, ధర్మము, దేశము, సంస్కృతి, సమాజము యొక్క ఉన్నతోన్నత విధానాలను ప్రపంచమంతా ఉద్బోధించి, మానవాళిని ఉద్రూతలూగించిన వివేకానందుడు, ''ప్రజలు, ప్రజలకొరకేపాలన'' అన్న అలనాటిశ్రీరామచంద్రుడు, లోకకల్యాణం, ప్రజాసంక్షేమం కొరకే యజ్ఞయాగాలు నిర్వహించివెన్నెముక సహితం త్యాగంచేసిన ఋషీశ్వరుల వారసులమైన యీ భారతజాతిలో నేడు మళ్ళీమళ్ళీ ప్రభుత్వ పతనాలు, మళ్ళీమళ్ళీ ఎన్నికలు మళ్ళీమళ్ళీ నికృష్టరాజకీయాలతో ప్రజల జీవితంతో చెలగాటాలాడడం సెక్యులరిజం పేరుతో...కాగా....

ఎక్కడో (U.P) ఎప్పుడో విదేశీ దురాక్రమణదారుల అక్రమ కట్టడం నేలమట్టంకాగా ఇక్కడ(A.P),ఇప్పుడూ, ఏమీసంబంధితులుకానివారిపై పోలీసులు కేసులు బనాయింపు, కొనసాగింపులు మళ్ళీ మళ్ళీ.

ఎక్కడున్నదీలోపం? ఎవరిదీ లోపం? ఎందుకీలో ఏం? ఎవరు కారణం?

ఏమిటినివారణం? అని సమాజంలోని ప్రతివ్యక్తి (పౌరుడు) ఆత్మపరిశోధన చేసుకోవలసిన అత్యవసరం ఎంతోలేదూ?

"భార్యచెడుగైన భరించుభర్త తప్పు, ప్రజలు తప్పైన పాలించురాజుతప్పు" అన్నది గతసూక్తి.

నేటి ప్రజాస్వామ్యంలో రాజులులేరు.. ప్రజలే. నేటినాగరికతలో భార్య, భర్త, అన్న ఎక్కువ తక్కువ లేవు. స్త్రీ, పురుషులు సమానబాధ్యతలు నిర్వహిస్తున్న యీనవతరంలో వికృతశక్తులు మళ్ళీ మళ్ళీ వివిధ వికార కలాపాలతో వీరవిహారం చేయకుండా వారిని పరాజితులచేయడానికి ప్రజలు (పౌరులు) విజృంభించి దేశాన్ని, సమాజాన్ని చక్కదిద్ది, సర్వతోముఖ సంవృద్ధి దిశగా నడిపించవలసిన పూర్తి బాధ్యత మళ్ళీ మళ్ళీ లేదూ?!

మన కర్తవ్యాన్ని మనం గ్రహించి నిర్వహించిన నాడే రవీంద్రుడు, రాణాప్రతాపుడు, పరశురాముడు, శంకరుడు, రామానుజుడు, నృసింహుడు, హనుమంతుడు, వీరసావర్కారు మొదలైన మహామహుల జయంతులు సఫలీకృతమౌతాయి.

శుభాశ్వశ్రుతం 'జైహింద్'

ఎందరో మహాత్ములందరికీ వంద
నాలు! మళ్ళీ మళ్ళీ మేళ్ళునంద
జేయురండు!! ప్రజల జేయులుగానుండ
విశ్వహిందు వాణి వినుడు వినుడు

-సుందరం

**జీవిత సభ్యులు**



**యమ్. అంజిరెడ్డి**
3-84, హనుమాన్ నగర్,
ధిల్‌షుఖ్‌నగర్,
హైదరాబాద్-60.

# హనుమజ్జయంతి

(మే 31,1997) – చే రెడ్డి శ్రీరామ్‌రెడ్

అంజనీ, కేసరిల ప్రియపుత్రుడు ఆంజనేయుడు. వాయు దేవుని అనుగ్రహము వల్ల కలిగాడ కాబట్టి వాయునందనుడని కూడ వ్యవహరించెదరు.

బాల్యముననే ఉదయించుచున్న బాల భాస్కరుని చూసి పండు అనుకొని పట్టుకుందామని పైకి వెళ్లి ఇంద్రుని వజ్రాయుధ ఘాతముచే మూర్ఛితుడై పర్వతముపైపడి హనుమ (దౌడ) దెబ్బతిన్నందున, ఆనాటి నుండి ఆంజనేయునికి హనుమంతుడు అను నామము సార్థకమయ్యెను హనుమంతుడు శ్రీరామునికి నమ్మినబంటు.

స్వచ్ఛంద మరణము గలవాడు అనగా తనకు యిష్టమైతేనే మరణించగలడు. మరణము యిష్టములేక చిరంజీవి అయినాడు.

శ్రీహరికి హనుమంతుడు చిన్నదాసు, గరుత్మంతుడు 'పెద్దదాసు' అనుముద్దు పేర్లుగలవు.

తను కోరిన మేరకు తన ఆకారాన్ని పెంచగలడు. తగ్గించుకోగలడు. వందయోజనాల సముద్ర దూరమును అవలీలగా లంఘించినవాడు. లంకలో ప్రవేశించి, సీతమ్మను చూసి, లంకను కాల్చి తిరిగి వందయోజనాల సముద్రమును దాటి వచ్చినవాడు. ఆ నాటి నుండే ''చూసి రమ్మంటే కాల్చి వచ్చినాడని'' సామెత ఏర్పడినది. ఆంజనేయులు సీతను గాంచిన వారము మంగళవారము. అందుకే స్త్రీలకు మంగళవారము శుభమైనది. ప్రీతికరమైనది. సంతోషకరమైనది. జన్మదినము శనివారము. జనన మందినది వైశాఖ బహుళదశమి. గ్రహ, పీడ, పిశాచాదులు హనుమత్ సేవకులకు బలాదూర్, శని పట్టి పీడించగాతలదిమ్మెక్కి నట్లుండెను. పెద్దబండరాయిని తలపై నిమోయగా, ఆభారమునకు శని విలవిలలాడెను. తనను వదలి పెట్టమని శని శరణువేడెను. ''తనను శనివారము నాడు పూజించిన భక్తులను బాధించకూడదు'' అను మాటను తీసుకొని ఆంజనేయుడు శనిని వదలి పెట్టెను. అందులకే శనివారమునాడు ఆంజనేయుని ఆరాధించవలెను. గ్రహబాధలుండవు. శని బాధలుండవు.

అరటి పండ్లు, తమలపాకులు స్వామికి అధిక ప్రియము అందులకే స్వామికి ' ఆకు పూజ చేయించెదరు. ఐదు సంఖ్య కూడ యిష్టమే.

అయోధ్యలో శ్రీరామచంద్రుడు జన్మమందినట్లు, తిరుపతి తిరుమల కొండలలోని అంజనాద్రి పర్వతముపైన ఆంజనేయులు జన్మించెను.

వ్యాయామము చేయువారు, సాము గరిడీలు నేర్చువారు యుద్ధ ప్రవీణులు, మల్లయుద్ధ నేర్పరులు స్వామిని ఆదర్శముగా తీసికొందురు. బజరంగ్ అనగా ఆంజనేయులే. 'జైబజరంగ్‌బళి' అను నినాదముతో నవయువకులు దేశ సమైక్యతను, హిందూ సంఘటనను హిందూ సంస్కృతిని, హిందూ ధర్మమును పరిరక్షించవలయును. సర్వేజనాః సుఖినోభవంతు' ఇదే హిందుత్వము హిందూత్వమే హిందూదేశమునకు శ్రీరామ రక్ష. హిందువులు అధికసంఖ్యాకులుగా ఉన్నంతవరకే దేశము యావత్ విశ్వము కూడ సుఖశాంతులతో వర్ధిల్లగలదు 'జై బజరంగ్ బళి'

జైహింద్



# శ్రీ రుద్రమ్

-డా॥ MVR శర్మ.

యాతేరుద్ర శివా తనూరఘోరా పాపకాశినీ
తయానస్తనువా శన్తమయా గిరి శన్తాభి చాకశాహి

మొదటి మంత్రముతో భగవంతుని ప్రసన్నునిగావించుకున్నాము. రెండవ మంత్రముతో సుఖములనిమ్మని ప్రార్థించినాము. ఈ మంత్రముతో ఈశ్వరుని హే రుద్రా! మేను కేవలం ప్రపంచానికి సంబంధించిన సుఖాలతో తృప్తిని చెందలేము. కనుక భగవత్సంబంధమైన ఆత్మ జ్ఞానాన్ని యిమ్మని అడుగుతున్నాము. ఆ ఆత్మజ్ఞానంతో ప్రకాశవంతులనుగా చేయుమని అర్థిస్తున్నాము.

అనాది నుండి కూడా ఈ గడ్డ మీద పుట్టిన సంస్కృతి ఇహం-పరం రెండూ కావాలన్నది. కేవల దైహిక సుఖాలు భోగాలు కావాలంటే మనకూ రాక్షసులకూ (లేదాపాశ్చాత్యులకూ ) తేడాయేమున్నది. కేవలం పరలోకం గురించి ఆలోచిస్తూ, గాలిలో సాము చేస్తూ, ఇహలోకంలో దుర్మార్గుల దుష్ట ప్రవృత్తి పెరిగి పోతూవుంటే-ముక్కు మూసుకొని, ''నాకు సమాజంతో పని లేదు'' నా దారి నేను చూసుకుంటాను అనటమూ తప్పే, ప్రపంచంలో బాగా మానసిక పరిణతి చెందిన మహానుభావులు కొందరు మాత్రమే వుంటారు. వారికి ఇహంతో పని లేదు. వారు సర్వజీవరాసులనూ ప్రేమిస్తారు. కేవలం చిన్న పిల్లల వలె, పిచ్చివారి వలె, ఒక నిర్దిష్ట జీవనపద్ధతి అవసరం లేని వారి వలె తిరుగుతూ వుంటారు. వారిని వదిలి పెట్టి సగటు మనిషిని గురించి ఆలోచిద్దాం. ఇతనికి ఇహ, పరాలు రెండూ అవసరమే. జ్ఞానం అలవడ్డ తర్వాత కూడా. అది అనుభవంలోకి రాకుండా సంసారబంధాలు అడ్డు తగులు తుంటాయి. పూర్వజన్మ కర్మలు, వాటి ఫలాలు మనిషి మనిషిగా మారకుండా ఎన్నెన్నో ఆకర్షణలు కలిగిస్తుంటాయి. వెరసి చాలామందికి యిటు దుఃఖాల నుండి విముక్తి కావాలి. అటు ఆత్మ జ్ఞానమూ కావాలి.

దీన్నే మన ప్రార్థనలో ''సముత్కర్షనిశ్శ్రేయ సస్యైకముగ్రం'' అని అభ్యుదయ సహిత నిశ్శ్రేయము, దీనిని పొందేందుకు సాధనంగా వీర వ్రతమూ మన మనస్సులో స్ఫురించుగాక అని ప్రార్థిస్తున్నాము.

'గిరిశన్త' అనుచో ఎన్నో విశేషార్థాలు. గిరులనగా-పర్వత భూములలో నుండి సాధారణ ప్రజకు సుఖకారకుడైన శివస్వరూపుడైన గిరిజనులని వొక యర్థము.

గిరి అనగా వాక్కు-వేదము. వేదార్థ రూపమున ప్రజలకు ఆనందమును కల్గించు ఈశ్వర రూపమని మరియొక యర్థము. గిరి యని మేఘమునకు పేరు. మేఘమున నుండు వర్ష రూపమున లోకమునకే మేలు చేసి ప్రజలను తృప్తులుగా చేయువాడని కూడా అర్థము.

పరమేశ్వర రూపమును పర్వతములలో, పర్వతవాసులలో, వాక్కులో, ప్రాణాలను నిలబెట్టే నీటిలో-యిలా అన్ని రకాల విశిష్ట వస్తువులలో చూచుట, చూడగల్గుట హిందువుల స్వభావము.

# పరిప్రశ్న




(పరిప్రశ్నకు శ్రీ కృష్ణానందమఠస్వామీజీ, దిల్‌సుఖ్‌నగర్, సమాధానాలు ఇస్తున్నారు - సం.)

("శిష్యుల ప్రశ్నలు సాధారణంగా లౌకిక దృష్టిలో ఉంటాయి. గురువుల సమాధానాలు తత్త్వదృష్టిలో ఉంటాయి. ఈ సత్యం అన్ని గ్రంథములలో కనబడుతుంది. పాఠకులు గ్రహించగలరు." - స్వామీజీ.)

ప్రశ్న - 1 'ఓం నమఃశివాయ' - పంచాక్షరి ( ఓం కాకుండా)
ఓం నమఃనారాయణాయ - అష్టాక్షరి ( ఓంతోకూడా)
పై మంత్రంలో అక్షరగణన సంఖ్య ఏవిధంగా అనుసరించారు? తేడా ఎందులకు?

- చే రెడ్డి శ్రీరామ్‌రెడ్డి. పొదలకొండపల్లె

**సమాధానం:** మంత్రములలో అక్షరగణన సంఖ్యకు తత్త్వశాస్త్ర ప్రమాణం కనపడదు. ఏదైనా స్థూల దృష్టితో కాక లక్షణముల చేత సమన్వయించేసుకోవాలి. పంచమహాభూతాలు, శబ్దాది పంచలక్షణాలు, పంచజ్ఞానేంద్రియములు అనే ప్రపంచమునకు సూచన పంచాక్షరీలోని పంచఅక్షరములు. శివుడు యీ ప్రపంచమునకు లయస్వరూపుడై ముక్తిని ప్రసాదిస్తున్నాడు. ఓంకారము కూడ పంచాక్షరీతత్త్వమున ఇమిడి ఉంది. అందువలన గణనకు రాలేదు.

స్థూల దృష్టికి అష్టైశ్వర్యములు (అష్టభోగాలు) వీటిని ప్రసాదించే అష్టలక్ష్మి స్వరూపము లేకనబడుతవి. ఈ బంధమునూ, దీనికి ఆవలనున్న ముక్తిని జీవుల పరిస్థితిలో చూపేది సృష్టియొక్క స్థితి, ఇదేనారాయణుడు. ఈతత్త్వాన్ని సూటిగా గ్రహించలేని జీవులకు, సూటిగ బోధిస్తున్న ఓంకారమును కలిపి ఈ అష్టాక్షరీ ప్రవర్తిస్తున్నది.

**ప్రశ్న. 2:** హిందువుతన గృహంలో పిల్లిని పెంచవచ్చునా?

- టి. ఫణిచంద్ర - కోఠి.

**సమాధానం:** హిందువు, పిల్లి, పెంచుట అను పదాలు సమన్వయంగ 'అవును-కాదు' అనే ప్రమాణము శాస్త్రీయముగ కానరాదు. ఇది వారి వారి స్వేచ్ఛామాత్రమే. ప్రాణితానున్న జన్మస్థితినుండి ఉత్తమజన్మను పొందే విధంగ ఇతరులు ప్రయత్నించుట 'పెంచుట' అనబడును. పిల్లలను పెంచినా, పిల్లులను పెంచినా ఈ విధంగా జరగాలి. అయితే యజ్ఞాది క్రతువులు, పితృకర్మలు, పూజ, మొదలైన సందర్భములలో అశుచి జరుగరాదని కర్మానుష్ఠానపరులైన వారు పిల్లులు, కుక్కలు, కోళ్ళు మొ॥ వాటిని పెంచరు. సాధుజంతువులైన గోమాతను పెంచిన అవివాటి (గో) శాలలో కట్టుబడి ఉంటవి, కనుక కర్మానుష్ఠానమునకు అడ్డురావు. మంచి గోవులు పూజార్హములు, గోమూత్రం, గోమయం రోగనిరోధకములగుటచే యజ్ఞాది కర్మలందు శుచిరూపములుగ గ్రహించబడినవి.

**ప్రశ్న-3.** వేదభూమి, పవిత్రభూమియైనభారతదేశంలో యజ్ఞాలు, హోమాలు, గీతాసందేశాలు నిత్యంజరుగుచున్నా సమాజంలో అన్యాయాలు, అక్రమాలు, హత్యలు కొనసాగుతున్నాయి-కారణము?

- రాంబాబు, ఒంగోలు.

**సమాధానం:** కర్తాస్వరూపం కర్మలో సదావ్యక్తమవుతుంది. మంత్రశుద్ధి, వాక్శుద్ధి, ద్రవ్యశుద్ధి, భావశుద్ధి, ఆచారశుద్ధి లేక ఆచరించినవి చేయబడనివే. (గీ17-28). అశ్రద్ధగా ఆచరించినా చేసేశామని భావించుట రాక్షసం (గీ16-15). ఇదే ఇప్పుడు జరుగుచున్నది. భారతదేశం వేదభూమి, పవిత్రభూమి అనుట సంశయంలేని సత్యం. యజ్ఞాలు, హోమాలు, గీతాసందేశాలు విధించిన ధ్యేయము విధానములు పరమసత్యములు వీటి వలన సర్వులకు శ్రేయస్సు కలుగుతుందనుటకూడా అక్షరసత్యం. కలుగుట లేదంటే అనుష్ఠాన నిర్వాహకుల లోపమే కారణము.

# ఛాందోగ్యోపనిషత్ విశేషాలు

జీవుని మరణానంతర ప్రయాణమార్గములను గురించిన వివరణ ఛాందోగ్యోపనిషత్, విశేషాలలో ఒకటి. ఎలాంటి కర్మలను ఆచరించినచో ఏవిధంగా ఏ జన్మలను పొందుతారు అనే విషయాన్ని వివరిస్తుంది. ఈ ఉపనిషత్తు.

1. లోక కల్యాణం మాత్రమే కాంక్షించే మానవునకు మరణానంతరం దేవయానమార్గం లభిస్తుంది. అనగా నిష్కామకర్మయోగులు, అరణ్యంలో శ్రద్ధతో తపస్సుతో, ఉపాసనలో లీనమైనవారు మరణించిన తర్వాత జ్యోతిర్మయ రూపమును పొందుతారు. ఇలా మొదట వెలుగురూపంలో ప్రకాశిస్తూ క్రమంగా వృద్ధిచెంది మరింత అధికంగా ప్రకాశిస్తూ తేజోవాయురూపాన్ని పొందుతారు. ఆ తరువాత శుక్ల పక్షంలో అధిక జ్యోతిర్మయులు కృష్ణపక్షంలో అల్ప జ్యోతిర్మయులుగా ఉత్తరాయణపు ఆరునెలలు కాంతివలె ప్రకాశిస్తూ ఉంటారు. ఆరునెలల జ్యోతిర్మయరూపమునుండి సంవత్సరజ్యోతిని, దాని నుండి ఆదిత్యజ్యోతిని, దాని నుండి చంద్రజ్యోతిని, దాని నుండి విద్యుత్ జ్యోతిని పొందుతారు. ఈ విధముగా మానవరూపము అమానవరూపముగా మారుతుంది. ఆరూపమే ఆత్మైక్యతకు సంకేతము – వీరికి మరల జననమరణములు ఉండవు వీరు ఉత్తమమానవులు.

2. లోకకల్యాణంతోపాటు చిత్తకామ్యసిద్ధికొరకు జీవించినమానవులకు పితృయాన మార్గం లభిస్తుంది. అనగా గ్రామములందు చెరువులు, బావులు త్రవ్వించి, దినాలు చేసి ఆంత్యోపాసన చేయువారు. మంద ప్రకాశమార్గమున (తక్కువ వెలుగు ఉండేమార్గం) తిరుగుతూ మరణానంతరం ధూమరూపమును, రాత్రి (చీకటి) రూపమును, కృష్ణపక్షరూపమును, దక్షిణాయన రూపమును, సంవత్సర రూపమును పొందుతారు. సకామ కర్మలను చేసినవారు ఇట్లు దక్షిణాయణమున పితృలోకమును, దానినుండి ఆకాశమున చంద్రలోకమును చేరుతారు. ఆచంద్రలోకము దేవతలకు అన్నము, ఈ మానవులు ఈ చంద్రలోకమున సకాములై భోగాలను అనుభవిస్తారు. కర్మఫలం ఉన్నంతవరకు చంద్రలోకంలో భోగాలు పొంది తిరిగి ఆకాశమునుండి వాయువు, వాయువునుండి ధూమము (పొగ), పొగనుండి మేఘము, రూపమును పొంది వర్షముగా వర్షించి వడ్లు, యవలు, ఔషధములు, వనస్పతులు, నువ్వులు, మినుములు వగైరాలుగా పుడతారు. ఈ పదార్థములను భుజించిన వారి వీర్యమునుండి – పశువుల వీర్యమున పశువులుగాను, మనుష్యుల వీర్యమునుండి మానవులుగాను జన్మిస్తారు. అనగా సకామకర్మ చేసేవారు చంద్రలోకమునుండి ఆకాశమార్గమున భూమిని చేరి పూర్వకర్మలఫలితంగా శుభ అశుభ జన్మలను పొందుతుంటారు. వీరు మధ్యమ మానవులు.

3. అజ్ఞానాంధకారంలో జీవించువారు అనగా దేవ, పితృయానమార్గములను అనుసరించనివారు – చిన్న చిన్న జంతువులుగాను, పురుగులుగాను, పక్షులుగాను, జన్మించుచు మాటిమాటికి జనన మరణముల బొందుతూ ఉంటారు. ఉదాహరణకు దొంగతనం చేసేవారు, కల్లువగైరా మాదకద్రవ్యములను సేవించేవారు. గురువుభార్యతో కలిసినవాడు, సత్పురుషుని, జ్ఞానవంతుని చంపినవాడు, పతితుడు అనబడతాడు. ఇలాంటి వారితో సాంగత్యం చేసిన వారు కూడా ఇలాంటి వారే అవుతారు. ఇలాంటి నీచకర్మలను ఆచరించినవారు అనేక జన్మల నెత్తుచు బాధామయ జీవితములను గడుపుతారు. ఇది అధమమానవుల లక్షణం.

కావున మానవులు జన్మరాహిత్యము కోసం తపస్సు, యోగము, సమాధి – వగైరాలతో కాలము గడపవలెను. ధర్మకార్యాలు చేసి ఉత్తమజన్మలను పొందాలి. దీనికి భిన్నముగావర్తించినచో అనేక జన్మకర్మలబంధములో చిక్కుకొని జననమరణక్రమమునే పొందుచూ కష్టాలపాలై దుఃఖిస్తారు.

సేకరణ: శ్రీ ఉపద్రష్ట వెంకటకృష్ణయ్య
విజయవాడ.



జీవిత కథ

# శ్రీకాంత్ జిచ్‌కర్ - ఒక అద్భుతమైన

(గతసంచిక తరువాయి)

## ఆ వివాహము ఒక ప్రేరణాత్మకమే

వారి వివాహము కూడా నాగపూర్‌లో ఒక చారిత్రిక సంఘటనగా పేరుగాంచింది. శ్రీకాంత్‌తో మరో నలుగురు మిత్రులు. అంతా ఐదుగురు. అందరూ అంతటి మేధావులే. సామాజిక కార్యంలో సహచరులే. ఒకే వేదికపై తామంతా వివాహాలు జరుపుకుందామని నిశ్చయించుకొన్నారు. ఐదుగురూ తమతమజీవన భాగస్వాములను స్వయంగా వెతుక్కొన్నారు. అప్పటివరకు మహారాష్ట్రంలో ఒక ఆచారం. ఒక్క బ్రాహ్మణుల వివాహాల్లో మాత్రమే అగ్ని చుట్టూ ఏడు ప్రదక్షిణలు–సప్తపది– తిరిగే పద్ధతి ఉండేది. ఇతరుల పెళ్లిళ్లలో కేవలం మంత్రోచ్చారణ, వధూవరులు పరస్పరం మాలలు వేసుకోవడం వరకే పాటించబడేది. అలాంటిది శ్రీకాంత్ అతని మిత్రబృందం తాము పూర్తివైదిక పద్ధతిలో యజ్ఞోపవీతాలు ధరించి, సప్తపదిలో అగ్నిప్రదక్షిణలు చేయాలని నిశ్చయించుకొన్నారు. అలాగే జరిగింది. ఆరోజు నాగపూర్ మొత్తం ఈ వివాహాలు చూడడానికి ఆ వివాహప్రాంగణంలోకి వచ్చిందంటే నమ్మండి. అయితే లక్షలాది రూపాలతో విందు భోజనాలు లేవు. మిరుమిట్లుగొలిపే ఆడంబరాలు, ప్రదర్శనలు లేవు. అయితే ఎవరికీ డబ్బుకొదవేమీలేదు. అప్పటికే శ్రీకాంత్ జిచ్‌కర్ నాగపూర్‌లో మంచి పేరు ప్రతిష్ఠలు సంపాదించాడు. ఆరోజులో తల్లి దండ్రులంతా తమ పిల్లల్ని 'శ్రీకాంత్‌లా వర్ధిల్లమని' దీవిస్తూండేవారు. శ్రీకాంత్ వివాహసందర్భంగా వచ్చిన అందరూ శుభాకాంక్షలకు సూచకంగా ఒక పుష్పాన్ని సమర్పించి అభినందించిడం, వెళుతు వెళుతూ ఈ ఆనందాన్ని పంచుకునేందుకు రెండు లడ్డూలు స్వీకరించడం – ఇలా కొనసాగింది. భారీ విందు భోజనపు ఏర్పాటులేదు. ఎంతో నిరాడంబరంగా జరిగిపోయింది. అలా ఈ వివాహం ఆనాటివరకు అమలులో ఉన్న అనేక సామాజిక రివాజులకు అడ్డుకట్ట వేసింది. అప్పటినుండి మహారాష్ట్రలో అనేక బలహీనవర్గాలు, బ్రాహ్మణేతర కులాల వారు కూడా అగ్నిచుట్టూ ప్రదక్షిణలతో పూర్తిగావించు వైదిక పద్ధతిలో వివాహాలు జరుపుకోవడానికి ఉత్సాహం చూపసాగారు.

**సాందీపని విద్యాలయం.**

శ్రీకాంత్‌దంపతులకు ఇప్పుడు ఇద్దరు సంతానం. ఒక అబ్బాయి, ఒక అమ్మాయి. ఆనందమయమైన కుటుంబం. అబ్బాయి యాజ్ఞవల్క్యకు ఐదు సంవత్సరాలురాగానే ఓ సమస్య ఎదురైంది. వాడిని ఏ పాఠశాలలో చేర్పించాలి అని. ఈ రోజుల్లో సమాజంలో కాస్త పలుకు బడికలిగిన ప్రతివాడూ ఏదో కాన్వెంటు లేదా ఇంగ్లీషు మీడియం స్కూలు వైపు పరుగులుతీస్తున్నాడు. పిల్లలను స్కూలుకు పంపడం అనేది ఇప్పుడు తల్లిదండ్రుల అభిరుచులకు అద్దంపట్టు ఒక ప్రక్రియ అయింది. నాగపూర్‌లో మంచివి అనిపించే ఏపాఠశాలలోనూ భారతీయ సంస్కారాలను అందించే ప్రయత్నం జరగడంలేదు అన్నది గమనించాడు శ్రీకాంత్, మరి అలాంటి విద్యాలయాలకు తన పిల్లవాడిన పంపించి ఏమీ ప్రయోజనం? ఇంకేం – ఆలోచన ఒకటి వచ్చేసింది చక్కని విద్యాలయం. అందులో ఉత్తమ విద్యాభ్యాసంతో పాటు హిందూ జీవన సంస్కారాలన్నీ అందివ్వగలది – స్థాపించాలని. అంతే ఒకరోజు నాగపూర్ పట్టణంలో ఒక పాత భవనం కొనేశారు. పత్రికలలో ప్రకటనలు యిచ్చారు – ఏమని? శ్రీకాంత్ జిచ్‌కర్ తన కుమారుని చేర్పిస్తున్న పాఠశాలలో మీ పిల్లలను కూడా చేర్పించదలచుకున్నారా? అని విద్యాలయం 'సాందీపని' అని నామకరణం చేయబడింది. విద్యాలయంలో ప్రవేశానికి ఏ విధమైన దానంగాని, విరాళంగాని అక్కరలేదు. తల్లిందండ్రులతో ఇంటర్వ్యూలుకూడా అక్కరలేదు. లేదా పిల్లలకు పరీక్షపెట్టడం అనే

నియమమూలేదు. ఖాళీలు ఉన్నంతవరకు ఎన్ని అభ్యర్థనలు వస్తే అన్ని స్వీకరించడం. అలా స్వీకరించడం ప్రారంభమైన రెండు మూడురోజులకే సీట్లన్నీ నిండిపోయాయి. నాగపూర్‌లోని తల్లిదండ్రులు కొందరు నిరాశచెందక తప్పలేదు. విద్యార్థులందరూ యజ్ఞోపవీతాలు వేసుకోవాలి. స్కూలు పాఠ్యాంశాలతో పాటు విద్యార్థులకు పూర్ణిమ, అమావాస్య, గంగాదసరా, కార్తీకపూర్ణిమ, వర్ష ప్రతిపద ( ఉగాది) అంటే ఏమిటి? వాటిని మనం ఎందుకు, ఎలా ఆచరించాలి. అన్నది బోధింపబడుతుంది. శ్రీ కృష్ణజన్మాష్టమి రోజున పిల్లలంతా శ్రీకృష్ణవేషధారణ చేసుకొనిరావాలి. ఏవో బొమ్మలు తయారుచేసుకొని తీసుకురావాలి. బలరామ జయంతి రోజున పిల్లలు ఎడ్లపూజచేస్తారు. ఇంటినుండి గిత్త బొమ్మలు చేసి తెస్తారు. ప్రతి పండుగ గురించి వైశిష్ట్యం పిల్లలహృదయంలో ఆరంభంనుండే హత్తుకుపోయి హిందూ సంస్కారం సహజంగానే అలవడుతుంది. మహారాష్ట్రలోని ప్రముఖ విద్యాలయాల్లో ఈ పాఠశాలకు ఇప్పుడు ఎంతో పేరు ఉంది. శ్రీకాంత్ జిచ్‌కర్ పత్రికావిలేకరి- రచయితకూడా. నాగపూర్ టైమ్స్ మరియు నాగపూరు పత్రికలకు అధిపతి గాను, ప్రబంధ సంపాదకులుగాను పనిచేశారు.

## ఇంకేమైనా ఉందా ?

శ్రీకాంత్ జిచ్‌కర్ గురించి చెప్పవలసింది ఇంకా అయిపోలేదుసుమండీ. కేవలం హిందూ జీవన పద్ధతి ద్వారానే జీవితం మనిషికి సుఖము, శాంతి, మోక్షము కలుగుతాయని నొక్కి చెబుతారు శ్రీ శ్రీకాంత్. ''అన్నిరకాల వైదిక కర్మకాండలు అవి ప్రాచీనకాలం ఎంత మహత్వపూర్ణమైనవో ఇప్పుడు ఈ కాలంలోనూ అంతే మహత్వపూర్ణమైనవి'' అంటారు వారు. ''అంటే నేటి తాంత్రిక యుగంలో కూడా సంసారికి జీవన వ్యాపారాలన్నింటితో పాటు ధార్మిక జీవనాన్ని అలవరచుకోవడం ఏమీ అసంభవం కాదు. ఈ కంప్యూటర్ యుగంలో యజ్ఞాలు ఏలా చేయాలి అని గాని, వైదిక శాస్త్రాల అధ్యయన, అధ్యాపనలు నిరుపయోగమని కాని అనుకుంటే అది పొరపాటే అవుతుంది. నాకు ఈ దిశాదర్శనం, సామర్థ్యం గీత మరియు వేదాల అధ్యయనం వల్లే లభించింది. వేదాధ్యయనం చేసేవ్యక్తి, వైదిక పద్ధతికి అనుకూలంగా జీవనయానం కొనసాగించేవ్యక్తి అతడు జీవితంలోని అన్నిరంగాలలోనూ ప్రగతిని సాధిస్తాడు'' అంటారు శ్రీ శ్రీకాంత్ జిచ్‌కర్.

## అయితే మీ పార్టీ ఏది ?

ఇంత చదివాక మీ కనిపిస్తుంది బహుశ శ్రీకాంత్ ఏదోధర్మాభిమానం కలిగిన, ధర్మం అంటే ఎంతో శ్రద్ధకలిగిన ఏదో పార్టీలో సభ్యుడు కావచ్చని. ధర్మాధారిత రాజకీయాలలో విశ్వాసంకలిగి, హిందుత్వ జయపతాకను విశ్వగగనంలో ఎగురవేయాలని ఉవ్విళ్లూరే పార్టీవాడని మీ కనిపిస్తుంది. కాని అదేదీకాదు శ్రీకాంత్ ఓ కాంగ్రెస్ నాయకుడు. ఇదే పార్టీటికెట్‌పై రాజ్యసభకు ఎన్నుకయ్యాడు. శ్రీమతి ఇందిరాగాంధీ అవలంభించిన రాజకీయ విధానాలలో అతనికి ఆసక్తి మెండుగా ఉండేది. శ్రీ పి.వి.నరసింహారావు గారు కూడా శ్రీకాంత్‌నే ఎక్కువగా అభిమానించే వారు అందుకే మొట్టమొదట శ్రీమతి ఇందిరాగాంధీ వద్దకు శ్రీకాంత్‌ను తీసుకు వెళ్లి ఆమె చేతనే నాగపూర్ నుండి శాసనసభకు పోటీ చేసేందుకు టిక్కెట్ ఇప్పించారు.

శ్రీమతి గాంధీ తర్వాత శ్రీరాజీవ్ గాంధీ పట్ల శ్రీ జిచ్‌కర్ తమ అభిమానాన్ని పెంచుకుని వారికి అత్యంత సన్నిహితులయ్యారు. శ్రీకాంత్ జిచ్‌కర్ మహారాష్ట్రలో ఒక మంత్రిగా పదవిలో ఉన్న సమయంలో అతనికి అనేకమంత్రిత్వ శాఖల అదనపుబాధ్యతలు యివ్వబడ్డాయి. దాదాపు ముఖ్యమంత్రి

అంతటి శక్తివంతుడుగా జిచ్‌కర్ మారాడు. ''కాంగ్రెసును ఆదర్శమైన పార్టీ అని నేను అనక పోయినప్పటికీ నేను మొదటినుండీ ఇదే పార్టీలో ఉన్నాను. కనుక దీనిని వదలి పెట్టాలని నాకెప్పుడు అనిపించలేదు. కాంగ్రెసులో ఉంటూ నా హిందుత్త్వనిష్ఠకు గాని, నా హిందూ జీవన పద్ధతికి గాని భంగకరమైన సలహానాకెవ్వరూ ఇవ్వలేదు. నేను జీవించాలనుకుంటున్న ధర్మానుబద్ధ జీవన విధానము కాంగ్రెసులో ఉంటూ కూడా సాధ్యమైనప్పుడు నేనెందుకు కాంగ్రెసును వదాలాలి? మరోపార్టీని ఎందుకు ఆశ్రయించాలి? పార్టీలో ఉండే మంచి చెడ్డలు మేము అంతర్గతంగా చెప్పుకుంటాము. బహిరంగ చర్చవల్ల ప్రయోజనమేముంది?'' అంటాడు శ్రీకాంత్ జిచ్‌కర్.

డా॥ శ్రీకాంత్ అంటారు ''వేలాది సంవత్సరాలుగా ప్రపంచంలో అనేక సంస్కృతులు, సభ్యతలు వెలిశాయి కాని కేవలం ఒక్క వైదిక సంస్కృతి, సభ్యత తప్ప మరేదీ బ్రతికి బట్టకట్టలేక పోయింది. ఈజిప్టు, మెసపోటేమియా, యూదు, ఇన్హక, మాయా మొదలైన సంస్కృతులన్నీ యిలాంటివే. కేవలం భారత దేశంలోనే గత 2000 సంవత్సరంలో నుండి ప్రామాణికంగా అగ్నిహోత్రపరంపర అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ వస్తున్నది. గ్రీసు దేశం నేడు గొప్పదే కావచ్చుకాని నేడు అచ్చట ఏథెన్సుయొక్క పూర్వ పరంపర ఏదైనా కొనసాగుంతోందా? వైదిక సంస్కృతిని వ్యతిరేకించేవారు అటు విజ్ఞానాన్నికాని ఇటు ధర్మాన్ని కాని దేన్నీ అర్థం చేసేకోలేదు. కనుక వారి మాటల పట్టించుకొనక్కరలేదు. కాలానుగుణంగా ఎవరికి వారు మార్పుచెందడం అవసరమే అయినప్పటికీ పరంపరను సజీవంగా ఉంచే ప్రయత్నం చేయడంకూడా అంతే అవసరం. పూర్వపురోహితు పిల్లలు పురోహితులుగా ఉండడంలేదు. వారి జీవన శైలిలోనూ మార్పు వచ్చేసింది. నా వివాహం సమయంలో ఐదుగురు బ్రాహ్మణలకు గోదానం ఇచ్చాము. వారిలో కొందరు పైఅంతస్థులలోని ఫ్లాట్‌లలోనివాసం ఉండడంతో సమస్యవచ్చి పడింది. వారు తమ గోవులు ఎక్కడ ఉంచుకోవాలి? అయితే ఇది కేవలం ఒక సర్దుబాటు సమస్యే తప్ప విశ్వాసంకోల్పోవలసిన అగత్యం ఇందులో ఏదీలేదు. ఎవరేమన్నా విశ్వసించిన వాటిపై నేను స్థిరంగా ఉంటాను. ఇదే నా పద్ధతి.

ఇదేదో సినిమా కథ కాదండీ. కళ్లముందు ఉన్న సత్యకథయిది. నాగపూర్ వెళ్లి కావాలంటే ఈ మాటల్లోని యథార్థాన్ని పరీక్షించి చూడండి. మేము మా ప్రతినిధుల ద్వారా అవి అన్నీ ఆరాతీసిన తర్వాతే శ్రీకాంత్ విషయంలో విన్నవన్నీ నిజమేనని నిర్ణయానికి వచ్చాము. శ్రీకాంత్ స్ఫురద్రూపి, చక్కని పరుగు వీరుడు కూడా. ఆరోగ్యవంతమైన శరీరానికి ఉండవలసిన అన్ని అర్హతలు ఆయనకున్నాయి. మరి ఈయనను ఏంచేద్దామంటారు? దేశానికి ప్రధానమంత్రిని చేద్దామా? రాష్ట్రపతి పీఠంలో కూర్చోపెడదామా? అతనిపేర 'జై'లు కొడుతూ తిరుగుదామా? రాజకీయాల (బురద)లో ఉన్నందువల్ల అతినిపైనా కొంత బురద తప్పదరు మరి. అపారమైన జ్ఞానం కారణంగా అతడు నాయకుడే. సందేహంలేదు. అయితే ప్రజానాయకుడౌతాడా అన్నదే కొంత సందేహాస్పదం. ఏదేమైనప్పటికీ ఆశ్చర్యం అవధుల దాటించి ప్రశంసల పల్లకీలోకి పయనింప జేసే అతని జీవితకథ నిజంగా అద్భుతమే మరి! ఏమంటారు?

'పాంచజన్య' (హిందీ) 1996 డిశంబరు 29 నాటి సంచికలోని వ్యాసం ఆధారంగా

– 'మంజీరా'

---

''కలసి ఆలోచించండి, కలసి చర్చించండి, కలసి మాట్లాడండి, కలసిముందుకు నడవండి మీకు వైభవం ప్రాప్తిస్తుంది''

–సేకరణ : మా॥ సుబ్బరాయుడు.

# పిచ్చమ్మ అవధూత (1870-1951)

(గతసంచిక తరువాయి)

- ఆచార్య బి. రామరాజు

అమ్మ మాహాత్మ్యం పండితులను పామరులను ఆకర్షించింది. ఆమె సమాధినుండి లేవగనే దర్శించుకున్నవారికి బాధలు తొలగేవి, సమస్యలకు పరిష్కారం లభించేది, సుజ్ఞానబోధలు ప్రాప్తించేవి. అమ్మ ఒకసారి తన భక్తులతో ''నాయనా నా తపశ్శక్తినంతా ధారపోసినా ఈ లోకంలో పేరుకొని పోయిన పాపాన్ని కడిగి వేయటం సాధ్యం కాదు. కర్మానుభవం అనివార్యం. పూర్వజన్మకర్మలను బట్టి సుఖదుఃఖాలు అనుభవించక తప్పదు. కర్మ పరిపక్వం కానిదే కష్టాలు తీరవు.'' అంటూ కర్మసిద్ధాంతాన్ని బలపరచింది. తమవద్దకు వచ్చివారికి సత్కర్మలు చేయండని బోధించేది. కర్మ పక్వమై సత్ఫలితాలు పొందినవారు వచ్చి ''అమ్మా నీకేమి ఇవ్వమంటావు? అని అడిగితే ''వీడికేమికావాలె? ఆ నుయ్యి తవ్వు, ఆ గోడ కట్టు'' అని ఆశ్రమ సేవ చేయించేది. మనుష్యుల ముఖాలు చూచి వాళ్ళ అర్హతలు వాళ్ళ పూర్వజన్మలు చెప్పేది. అమ్మ అర్ధనగ్నంగా ఉండేది. కామసంకల్పం గలవాళ్ళు వస్తే ''వాడికంట్లో దోషం ఉంది, నాకు దుప్పటి కప్పండిరా. వాడు వస్తున్నాడు'' అనేది. అక్కగారు ఇతర బంధువులు వచ్చి అమ్మను తమ యిండ్లకు రమ్మంటే పోలేదు సరికదా ''వీడు మంచిమార్గంలో ఉన్నాడు. మీరు కూడ మాయను వదలి మంచి మార్గంలోనికి రండి. మీ లోకం వేరు వీడిలోకం వేరు'' అన్నది. పూర్వజీవితంలో అమ్మ దగ్గర అప్పు తీసుకున్న పెద్ద మనిషి అప్పు చెల్లించటానికి వస్తే ''వీడు ఎవ్వరికీ ఋణం లేడు, ఎవ్వరూ వీడికి ఋణం లేరు, పోపో'' అన్నది. ఒకసారి సనాతనాచార పరాయణుడైన బ్రాహ్మణుడు అమ్మ దర్శనానికి వచ్చి, అమ్మ మాలది కనుక దూరంగా నిలబడి మాట్లాడుతున్నాడు. అమ్మ ''వడికిన నూలు పోగులు మెడలో వేసుకొని గొప్పకులంవాడినని భ్రమపడుతున్నావు. వడకని పోగులు నీలో ఉన్నాయి. వెదకి చూచుకో!'' అన్నది. ఛాందసబ్రాహ్మణులతో ''మీకు ఆచారం ఉంది, మలినం పోలేదు, దూరంగా ఉండి దండం పెట్టుకుపొండి'' అన్నది. ''రామనామము మాలా? నీ నామము మాలా? ఇందులో ఏది మాల?'' అని ప్రశ్నించేది.

అద్వైతమూర్తిగా మారిన అమ్మ మాటలు చేష్టలు చిత్రంగా ఉండేవి. తనను గురించి అమ్మ 'వీడు' అనేది. 'వాడే (ఆ రాముడే) వీడు' అనేది. 'ఆ రాముడు ఎట్లా పలికిస్తే అట్లా అంటాడు వీడు' అనేది. తన పూర్వజన్మలగురించి 'వీడు ఒక జన్మలో రాజు; తరువాత వైష్ణవుడుగా పుట్టి మాలవాళ్ళను రోతగించు కున్నాడు. అందుకే ఈ జన్మలో మాలకులంలో పుట్టించాడు రాముడు' అని చెప్పింది. అమ్మ ధనాన్ని వెండి బంగారాలను 'రోత' అనేది. అవధూతగా మారిన తరువాత అమ్మ వీటిని తాకలేదు; దరి జేరనివ్వలేదు. అమ్మను పరీక్షించటానికి ఆమె పరవశస్థితిలో ఉన్నప్పుడు, ఒక భక్తుడు అమ్మ వేలికి బంగారు ఉంగరం తొడిగినాడు. ఊళ్ళోని భక్తుడొకడు ఇంటికి పిల్చి ఆమె కానకుండా కప్పుకునేదుప్పటికి వెండి గ్లాసు కట్టినాడు. అమ్మ ఉంగరాన్ని మురికి కాల్వలోనికి విసరింది; వెండిగ్లాసును గొడ్లకాపరులను విప్పుకొమ్మన్నది. అమ్మను పరీక్షించాలెననుకున్నవారి ముఖాలు వెలవెల బోయినవి. దర్శనానికి వచ్చే సంపన్నులతో 'మీ దగ్గరి రోతనంతా దానధర్మాలు చేయండి'. అనేది. అమ్మ భాషలో అడవి అంటే అజ్ఞానం. 'మనవూళ్ళు చిన్న అడవులైతే ఆ పట్నాలు పెద్ద అడవులురా' అనేది. శ్రీమలయాళస్వాములతో ''ఒరేయ్ నీకు ఇంకో

చొక్కా వుందిరా'' అన్నది. చొక్కా అంటే జన్మ. అమ్మ భాషలో దూడలంటే పాములు. ''ఒరేయ్ ఇక్కడ దూడలు తిరుగుతుంటాయి, జాగ్రత్తగా చూచిరండి'' అని హెచ్చరించేది. పాములు అమ్మ ఒంటిపై ప్రాకేవి. ఆమె నాగాభరణ. ఆశ్రమానికి క్రొత్తగా వచ్చిన భక్తుడు ఆశ్రమంలో తిరగుతున్న పామును కట్టతో కొడితే ఆ దెబ్బ తనకు తగిలినట్లు అమ్మ విలవిలలాడిపోయింది. ఆ పామును ఒడిలోనికి తీసుకొని నీవు మనిషివౌతావు అని దీవించినది. ఆ పాము అమ్మ చేతిలో ప్రాణం విడిచింది. అమ్మ నిర్యాణం దాకా ఆ పాము శరీరం ఆశ్రమంలో భద్రపరచినారు. ఒక కుక్క వచ్చి అమ్మ కెదురుగా నిలిచింది. 'ఎవరివే నీవు? వీడి దగ్గరుంటావా?' అని అమ్మ ప్రశ్నిస్తే అది తల ఊపింది. ఆ కుక్క అమ్మ పాదాలవద్ద **10** ఏండ్లున్నది. ఒకనాడు అమ్మ దాని తల నిమురుతూ 'మానవలోకం విడిచిపోతావటే! పోవే! ముందు మనిషివౌతావు లే' అన్నది. ఆ కుక్క శరీరం కూడా కుళ్ళిపోకుండా అమ్మ నిర్యాణందాక ఆశ్రమంలోనే ఉండినది. ఆధ్యాత్మికమార్గం కత్తిమీది సాముని అమ్మ హెచ్చరించేది. 'గోంగూర తోటకూర అనుకున్నారా! చేటలో వడ్లు పోసి వెలపెట్టి కొనటానికి? వేదాంతం అనప గుగ్గిళ్ళు కావు ఇనుప గుగ్గిళ్ళు' ''ఆత్మయుద్ధం చేయాలి; నా-నీలేకుండా పోవాలి. అప్పుడు కనపడతాడు దేవుడు. ఎద్దల్లే తిని మొద్దల్లే పడుకుంటే దేవుడు కనపడడు'' అనేది. ఒకసారి చుట్టున్న స్త్రీలతో ''ఒసేయ్ ముండల్లారా! మాయ మగణ్ణి చూచి మురిసిపోతున్నారేమే! కమ్మని మగడు ఇక్కడున్నాడు. ఎట్లా రమిస్తున్నాడో చూడండే'' అంటూ తమ భ్రూమధ్యంలో వేలూని చూపి సమాధిలోనికి పోయింది అమ్మ.

శిష్యులకోరికపై అమ్మ తీర్థయాత్రలకు బయలుదేరి ఆసేతుహిమాచలం పునీతం చేసినది. వల్లభనేని అన్నపూర్ణమ్మ, పిన్నమనేని నాగయ్య ఆ యాత్రల్లో అమ్మను సేవించినారు. భద్రాచలం, తిరుపతి, శ్రీకాళహస్తి, శ్రీశైలం, మహానంది, కాశీ, ప్రయాగ త్రివేణీ సంగమం, మధుర, దక్షిణేశ్వరం, అరుణాచలం, వంటి పుణ్యక్షేత్రాలు మెట్టి వచ్చింది. దక్షిణేశ్వరంలో అమ్మ ''రామకృష్ణ పరమహంస, దేవిలో ఇమిడి పోయినాడు. దేవి పరమహంసలో ఇమిడింది. పరమహంసకు చావు పుట్టుకలు లేవు.'' అన్నది. శ్రీ రమణాశ్రమంలో సరాసరి వెళ్ళి అమ్మ రమణ మహర్షి ఆసనంపై కూర్చుండగా రమణులు అమ్మ ప్రక్కన ఆసీనులైనారు. అమ్మ అమాంతంగా మహర్షిపై వాలిపోయింది. లేచిన తరువాత 'ఎప్పుడూ అంతదూరం ఏమి చూస్తుంటావు?' అని అమ్మ అడిగితే మహర్షి 'నువ్వు చూచేదే నేను చూస్తున్నాను' అన్నారు. అమ్మ తిరుమలకు పోయి అర్చకులు చూస్తుండగా గర్భగుడి చొచ్చి 'ఏమిరా వెంకన్నా? ఇక్కడున్నావురా?' అంటూ పసిపిల్లవాణ్ణి వలె శ్రీ వెంకటేశ్వర స్వామిని తట్టి పల్కరించింది. శ్రీ మలయాళస్వామి కురుమద్దాలికి **(1936)** వస్తే ఆయనను ఎదుర్కొని కౌగిలించుకున్నది. ఆయన నిశ్చేష్టుడైనారు. ఆనందాశ్రమవాసి కొమ్మరాజు లక్ష్మీకాంతయోగిని అమ్మ చూడబోయింది. ఆమెకు యోగిపై ప్రేమ, ఆయనకు అమ్మపై భక్తి, ఇరువురూ ఒకరి ఆశ్రమానికి మరొకరు రాకపోకలు సాగించినారు. **1924**లో మహాత్మాగాంధీ బందరుకు వచ్చినపుడు స్వామి సీతారాం అమ్మను మహాత్ముని వద్దకు తీసుకపోయినారు. మహాత్ముణ్ణి ఆలింగనం చేసుకొని అరటిపండు నోటికందిస్తూ 'ఒరేయ్ లోకసేవ చేస్తున్నావురా! చేయ్ తప్పకుండా చేయ్' అన్నది. అమ్మ ఆశ్రమానికి మలయాళస్వామి. ప్రణవానందస్వామి, లక్ష్మీకాంతయోగి, లలితానంద సరస్వతీ స్వామి, పెనుమచ్చయోగిని ప్రభృతులు వచ్చి తత్త్వ గోష్ఠి చేసినారు. ప్రసిద్ధ రచయిత గుడిపాటి

వెంకటచలం 13 ఏండ్ల కూతురు సౌరిస్‌తో 1938లో అమ్మను ఆశ్రమంలో చాలాసార్లు దర్శించినారు. వారి భవిష్యత్తు అమ్మ చెప్పింది. చలం తమ అనుభవాలు స్మృతులు చింతాదీక్షితులు గారికి వ్రాసినారు. ఇంకా శ్రీ పాద కృష్ణమూర్తిశాస్త్రి, ఉన్నవ లక్ష్మీనారాయణ, కాటూరి వెంకటేశ్వర రావు, త్రిపురనేని గోపీచంద్, వేలూరి శివరామశాస్త్రి వంటి ప్రముఖులు అమ్మను దర్శించి వ్రాసినారు. అమ్మ వాగమృతాన్ని వేలూరి శివరామశాస్త్రిగారు 1938 ఆంధ్రపత్రికలో వ్యాసాలుగా ప్రకటించినారు. ఆంధ్ర మహాభక్త విజయం గ్రంధకర్త పంగులూరి వీరరాఘవుడు అమ్మ సమాధిస్థితినుండి లేచిననాడే సాయంకాలం 5 గంటలకు అమ్మ సన్నిధికి వెళ్ళితే ఆమె లేచి వచ్చి కౌగిలించుకొని లోనికి తీసుకపోయింది. ''నీకు ఆకలౌతుందా? పొద్దున ఎప్పుడో బువ్వ తిన్నావు కదా! ఆకలి కాదా మరి'' అంటూ ఒక లడ్డు తెచ్చి చేతిలో పెట్టబోతే ఆయన నీవు మాలదానవు నేను బ్రాహ్మణుడను అంటే అమ్మ 'భక్తికి కులం ఉందట్రా! తినుతిను' అంటూ లడ్డూ నోట కుక్కింది. ఆయన సంతోషంగా తిన్నాడు. అమ్మ ఇచ్చిన మంచినీళ్ళు త్రాగినాడు. ఎవరు వచ్చినా మాతృప్రేమ వర్షించే అమ్మ స్వభావం గుర్తించి ఆనందించినాడు. లలితానందసరస్వతిస్వామి వారాహ్వానిస్తే అమ్మ 1949లో పశుమలలో స్వామివారు నిర్వహించిన రుద్రయాగానికి వెళ్ళి వైదికసన్మానం పొందినది. గాలివలె తేలికగా కొండెక్కి సుబ్రహ్మణ్యస్వామిని నాగసర్పం ఆకారంలో దర్శించినది.

అమ్మ అడుగు జాడల్లో నడచి, జనం తరించే మార్గోపదేశం చేసినవారిలో మాచవరపు రామమ్మ బ్రాహ్మణి, తుమ్మలబీడును ఫలవంతం చేయుమని అమ్మ ఆదేశిస్తే జీవితమంతా ధర్మోపదేశాలకు ధారపోసిన త్యాగమూర్తి రామమ్మ. రుద్రభూమిలో అమ్మను వెన్నంటి తిరిగిన బాలయోగిని బుచ్చమ్మ ప్రథమ శిష్యురాలు. ఆమె అసలు పేరు శకుంతలమ్మ. అమ్మ మార్గం అనుసరించి తరించిన మహిళాత్మ, ప్రియశిష్యురాలు, అమ్మచే మంత్రోపదేశం పొందిన కొసరాజు రాజేశ్వరమ్మ చిన్నమ్మగా నీరాజనాలందుకున్నది. నిష్కారణంగా అమ్మను దూషిస్తూ వైరం పెంచుకున్న పిన్నమనేని వీరయ్యకు ప్రభుత్వాధికారులు ఏవో లోపాలమూలంగా రైస్‌మిల్లుకు అనుమతి ఇవ్వకపోతే వారికి చెప్పి అమ్మ అనుమతి ఇప్పించింది. అపకారికి కూడ ఉపకారం చేసే బుద్ధి అమ్మది. వీరయ్య వైరం భక్తిగా మారింది. అమ్మ అనుగ్రహంతో సత్సంతానం పొందిన పవిత్ర చరిత్రుడు దిట్టకవి రామకృష్ణయ్య. ఇంకా వేములపల్లి వరలక్ష్మమ్మ, పిన్నమనేని వెంకమ్మ, అన్నపూర్ణమ్మ, వెంకటనరసమ్మ. మంగమ్మ, రామకోటి, నాగయ్య, నాగిరెడ్డి వెంకట సుబ్బయ్య దంపతులు, మాచవరపు రామమ్మ, బుజ్జవరపు వైదేహమ్మ వంటి ఎందరో అమ్మ అనుగ్రహానికి పాత్రులైనారు.

1951 జనవరిలో అమ్మ తన భక్తులతో ''ఈ మఠం తగులబడి పోతున్నది'' అన్నారు. ''ఒరేయ్ వంటవాడు పైకెక్కుతున్నాడు. ఇక వంట తయారు కాదు'' అంటూ తమ మరణం నర్మగర్భంగా సూచించినారు. చుట్టున్న భక్తులంతా దుఃఖించి దూరపు భక్తులకు వార్తలంపినారు. అది శా.శ. 1873 ఖరసంవత్సరం పుష్య శుద్ధ అష్టమి సోమవారం 15-1-1951. ఆ రాత్రి ఒంటి గంటకు తాను వెళ్ళి పోతున్నట్లు అమ్మ స్పష్టంగా చెప్పింది. భక్తులతో తమ కిష్టమైనవి తినిపించండంటే అందరూ తమ చేతులతో ఆయా పదార్థాలు తినిపించినారు. ఎవరేమి తినిపించినా అమ్మ తిన్నది. అమ్మ రామనామం చేస్తుంటే భక్తులనుసరించినారు. సరిగ్గా రాత్రి ఒంటిగంటకు అమ్మ భ్రూమధ్యంనుండి గొప్ప ప్రకాశం వెలువడి ఆశ్రమమంతా నిండి పోయింది. కారణశరీరం దాటి మహాకారణంలో చేరి

పునరావృత్తిరహితస్థితిని అందుకున్న అమ్మ ప్రత్యక్ష సచ్చిదానందమూర్తి అవధూతచక్రవర్తి. ముందుగానే సిద్ధం చేయించిన సమాధిలో అమ్మ శరీరం శాస్త్రోక్తంగా నిక్షేపించినవారు కొమ్మరాజు లక్ష్మీ కాంత యోగి. అమ్మ ఆజ్ఞననుసరించి దేవీరూపంలో ఉన్న నల్లరాతి విగ్రహాన్ని అమ్మ సమాధిపై ప్రతిష్ఠించినారు. తరువాత తెల్లరాతి విగ్రహం ప్రతిష్ఠించినారు. భక్తులు ఆ రెండు విగ్రహాలను నల్లమ్మ, తెల్లమ్మ అంటారు. ప్రతిదినం ఆ విగ్రహాలకు అర్చన జరుగుతున్నది. అమ్మ పేరుతో ఖమ్మంజిల్లా బూర్గంపహాడ్‌లో కూడ ఒక ఆశ్రమం ఏర్పడింది. అమ్మ భక్తురాలు ఆశ్రమనిర్మాత కొసరాజు రాజేశ్వరమ్మగారి ఆధ్వర్యవంలో బాలబ్రహ్మ లక్ష్మీనారాయణ యోగి 1984లో ఈ ఆశ్రమానికి శంకుస్థాపన చేసినారు. కొసరాజు హరీంద్ర విఠల్ నేతృత్వంలో ఇక్కడ ఆధ్యాత్మిక సాంస్కృతిక కార్యక్రమాలు వైభవంగా జరుగుతున్నాయి. రామావధూత పిచ్చమ్మ తల్లి కులాన మాల, శ్రీ రామచంద్రుని పాదాల మందారమాల, నమ్మి కొలిచే భక్తుల మెడలో స్ఫటికాక్షమాల.

7-5-1995 నాడు మచిలీ బందరులో దొంతులమ్మ సమాధిని దర్శించిననాడే కురుమద్దాలిలో రామావధూత పిచ్చమ్మ సమాధిని దర్శించే భాగ్యం మాకు కలిగింది.

ఆధారాలు :- (1) ఆంధ్రమహా భక్తవిజయము -పంగులూరి వీరరాఘవుడు, అప్పికట్ల - 1957

(2) అవధూత పిచ్చెమ్మ M.R. నాగేశ్వరరావు - గుడివాడ 1969

(3) శ్రీరామావధూత పిచ్చమ్మ తల్లి జీవితచరిత్ర - పరిపూర్ణ కామేశ్వరరావు, భద్రాచలం.

---

# విప్లవవీరుడు-శ్రీ (సీతా) రామరాజు

## 4-7-1897-జననం.

(1924-మే.7. సీతారామరాజుబలిదానం).

1947 భారత స్వాతంత్ర్య సిద్ధి అనంతరం సీతారామరాజు తల్లి (సూర్యనారాయణమ్మ) రాజకీయబాధితులుగా ప్రభుత్వ సహాయం కోరగా, ఎట్టి సహాయం అందలేదు.

అపుడా తల్లి ''నా చిట్టిబాబు (శ్రీరామరాజు) కాంగ్రేసుకు మార్గదర్శకుడు.1921 సంవత్సరములోనే మద్య నిషేధమును అమలు జరిపెను. పంచాయతీ కోర్టులు స్థాపించెను. దేశ స్వాతంత్ర్యమునకై బ్రిటీస్ ప్రభుత్వమును పారద్రోలవలెనని తిరుగుబాటు చేసెను. నా కుమారుని వంటి వారు అనేకులు ఆత్మబలి దానము చేయుట చేతనే నేడు స్వాతంత్ర్యము సిద్ధించినది. అఖిలభారత కాంగ్రేస్ సిఫార్సును కూడ త్రోసిరాజను కాంగ్రేస్ ప్రభుత్వము నేడు పరిపాలించుచున్నదా?

బ్రిటీష్ ప్రభుత్వము సహితము 50. ఎ. భూమినిచ్చి, పశువులనిచ్చి, ఇండ్లు కట్టించి, పంటపండువరకు అన్నింటిని సప్లయి చేయు ఏర్పాటే చేసిరే, కాని జాతీయ ప్రభుత్వము కదా యని చెప్పుకొనినను తిరస్కరింపబడెనా? నా యోగమును బట్టి వారికాబుద్ధి సర్వేశ్వరుడు తోపించినాడు''

అని-సూర్యనారాయణమ్మ-వాపోయెను.

మరినేడెందరో స్వాతంత్ర్య సమర యోధులు!!!!

(అల్లూరి సీతారామరాజు చరిత్ర నుండి డి.వి. రామరాజు)

# ఆదిత్యహృదయం

(గత సంచికతరువాయి) - డా॥ అల్లూరి వెంకటనరసింహారాజు

మానవునిది కేవలం సాపేక్షక స్థితి. ఉన్న స్థితి నుండి అతడు ఒక మెట్టు పైకెక్కి సాత్త్వికుడైతే, అమరుడౌతాడు. ఒక మెట్టు క్రిందికి దిగి, తామసుడైతే అసురుడౌతాడు. మామూలుగా రజోగుణంతో ప్రవర్తిల్లుతూ ఉంటాడు. ''దీనిని నేనే చేస్తున్నా'' నన్న అహంకారం, '' ఇది నా వల్లనే పాడైపోయిందన్న'' దైన్యం, అతనిని సదా ఆవహిస్తూ ఉంటుంది.

పుణ్యం అంటే ఆరోగ్యం. పాపం అంటే వ్యాధి. దివ్యగుణ సంపత్తి పెరిగితే జీవితం హాయిగా ఉండి విశ్వశ్రేయస్సుకు దారి తీస్తుంది. అసుర లక్షణం వృద్ధి చెందితే మనసుకు క్షోభకలిగి లోకం సర్వనాశనమౌతుంది.

ఆదిత్య హృదయంలో గల ముప్ఫైయొక్క శ్లోకాలలోను చివరి శ్లోకాన్ని శాంతి మంత్రంగా భావిస్తే, మిగిలిన ముప్ఫై శ్లోకాలలోను మొదటి తొమ్మిది శ్లోకాలు పూర్వరంగమౌతాయి. ఆ భాగం అంగన్యాస కరన్యాసాలతో కూడినది. అంగన్యాస కరన్యాసాలంటే తాను విశ్వసించిన దేవతా స్వరూపాన్ని, సర్వావయవాలలోను జీర్ణింప జేసికొనడం అన్నమాట. చివరి తొమ్మిది శ్లోకాలు ఉత్తర భాగం అందు స్తోత్ర ప్రాశస్త్యం ఫలశ్రుతి చెప్పబడింది. ఇక మధ్య గల పన్నెండు శ్లోకాలు ద్వాదశాదిత్యులకు ప్రాతినిధ్యం వహిస్తాయి. మళ్లీ ఆ పన్నెండు శ్లోకాలలోను తొలి ఆరు శ్లోకాల్లోను ఆయన దివ్యనామ సంకీర్తనం, మలి ఆరు శ్లోకాలలోను, ఆయునకు నమోవాక పురస్సరంగా అంజలి ఘటించడం కనిపిస్తుంది. ఈశ్వరార్చనలోని నమక, చమకాల లాగ, ఆదిత్య హృదయంలో యీ భాగంలోగల శబ్దాలు శ్రుతి సుభగత్వాన్ని సంతరించుకొన్నాయి.

ఆదిత్య హృదయంలోని నమకంలో ముప్ఫైమూడు దేవతా స్వరూప నామాలున్నాయి. ''సర్వ దేవాత్మకో హ్యేష తేజస్వీ రశ్మి భావనః'' అన్న శ్లోకం నుండి '' ఋతుకర్తా ప్రభాకరః'' అన్న శ్లోకం వరకు గల సూర్య స్వరూప వర్ణనలో ఇరవై ఎనిమిది నామాలున్నాయి. '' ఆదిత్య స్సవితా సూర్యః ఖగః పూషా గభస్తిమాన్'' అన్న శ్లోకం నుండి ''ద్వాదశాత్మన్నమో స్తుతే'' అన్న శ్లోకం వరకు గల, సూర్యస్తుతిలో నలభైయేడు నామాలున్నాయి. వెరసి నూట ఎనిమిది నామాలయ్యాయి, కనుక, ఆదిత్య హృదయం ఒక్కసారి పఠిస్తే, సూర్య అష్టోత్తర శతనామావళి పారాయణ చేసినట్లౌతుంది! (సశేషం)

---

## 10రో. సంస్కృత అభ్యాసవర్గ

మే మాసంలో 10 రోజులు సంస్కృత అభ్యాసవర్గ (రోజూ 4 గం॥ మాత్రము) వి.హిం.ప. అధ్వర్యంలో నిర్వహింపబడనున్నది.

10వ తరగతి ఆపైస్థాయి విద్యార్థులు, అభిరుచి ఉన్న ఇతర పెద్దలు, పిన్నలు పాల్గొనవచ్చును.

4-5-1997న భాగ్యనగర్ లో ఉ॥10గం. నుండి 12గం. వరకు సంస్కృత సమావేశము జరుగనున్నది. ఆ సమావేశములో పై 10 రో. అభ్యాసవర్గ వివరములు అందించబడును.

10 రోజుల వర్గలో డా॥ అవధానులు గారు శిక్షణ యిస్తారు. జంటనగరాలలోని అభ్యర్థులేగాక జిల్లాలనుండి గూడ అధికసంఖ్యలో విద్యార్థులు వచ్చి శిక్షణ పొందవచ్చును.

వివరాలకు

**కాంతాజీ**, 'విజయశ్రీ' 4-5-212, కోఠి, హైద్రాబాద్ - 005.

# 'ఆది నుండి ఆధునికం వరకు - స్త్రీ'

(గతసంచిక తరువాయి) — డా. జి. విజయలక్ష్మి

అథర్వవేదంలో కూడ విధవాస్త్రీకి పునర్వివాహాలున్నట్లు తెల్పేమంత్రాలున్నాయి. 10వ మండలంలోని 8వ సూక్తంలోని 3వ మంత్రం యొక్క భావం - ఓనారీ!లే!! విగత ప్రాణుడైన వాని గూర్చి చింతించకు. చని పోయిన వాడిగురించిన చింతవదలిపెట్టు. సజీవులుగల ప్రపంచంలోకిరా! నిన్నెవరైతే వివాహానికిష్టపడతారో వానికి పత్నివికా! అలాగు 8వ అనువాకంలో 3వ సూక్తంలో 1వ మంత్రార్థంకూడ-

ఓ పురుషుడా! విధవయైన ఈ స్త్రీ వివాహాన్ని వాంఛించి, సనాతన ధర్మాన్ని పాలిస్తూ నీ యొద్దకు వస్తున్నది. ఈమెకు సంతాన ఫలాన్ని, ధనబలాన్ని సమకూర్చు అనివుంది. సదాచార విషయములో శ్రుతి స్మృతిపురాణాలన్ని ఒకే భావమును వ్యక్తీకరిస్తున్నాయి. భర్తృరహితయైన స్త్రీ అనాధగా మనలేదని, పునర్వివాహం శాస్త్ర సమ్మతమని తెలియజేసే మంత్రాలు అన్నిటావున్నాయి. ఆకాలమున ఉద్దండ పండితులెల్ల నిరాఘాటముగా సమ్మతించినట్లు ఆధారములనేకములు.

దివోదాసనురాజు తన కూతురు దివ్యాదేవికి ఒకరి తర్వాత ఒకరు మరణించుచుండగా 2సార్లు వివాహముచేసినట్లు ఒక ఉద్గ్రంధము వల్ల తెలుస్తోంది. కేవలము భర్త చనిపోయినపుడేకాదు, అతను జీవించియున్నను, ఆమెననాధగా వదిలివెళ్లినపుడు పునర్వివాహం చేసుకోవచ్చునని కూడ పరాశరస్మృతిలో చెప్పబడింది.

నష్టేమృతే ప్రవ్రజితే క్లీబే చపతితేపతౌ

పంచస్వాపత్సు నారీణాం పతిరన్యోవిధీయతే॥

భర్త మరణించినపుడు, దేశాంతరమేగి తిరిగి రానపుడు, సన్యాసము పుచ్చుకున్నప్పుడుగాని, నపుంసకుడైనపుడు, పతితుడైనపుడు అంటే అన్య స్త్రీలపై ఆసక్తుడైనపుడు స్త్రీ మరొకరిని భర్తగా స్వీకరించవచ్చును అని పైశ్లోకభావము. అయితే మిగతా కారణాలన్నీ సబబుగానేవున్నాయి కాని, దేశాంతరమేగినవాడు తిరిగిరానపుడు - అంటే ఒకవేళ వివాహం చేసుకున్న తర్వాత తిరిగివస్తే ఎట్లా అన్న సందేహం రాకమానదు. అందుకు కూడ మరో శ్లోకంలో వివరించబడింది. సంతానవతియైతే ఏడేళ్లు, నిస్సంతానయైతే మూడేళ్లు ఎదురుచూసి ఆ తర్వాత వివాహం చేసుకోవచ్చునట. స్త్రీజన సంతోషముకొరకెన్నియో సూక్తులు చెప్పబడినవి. అయితే పునర్వివాహము పాపమో, నేరమోనని భావించే మూర్ఖులు కొందరైతే, వివాహం లేకపోతే బ్రతకలేదా అని యోచించే యువతులు కొందరున్నారు. పునర్వివాహముయుక్తమని ప్రభోదించు మంత్రములున్నట్లే, వివాహము పవిత్రము, దివ్యమునగు ఆత్మికబంధమని వేదములు తెల్పుచున్నవి. 'వి' అనగా అసాధారణమైన 'వాహ' అనగా శకటమని వైదికులు వ్యాఖ్యానించారు. ఈ జీవన శకటమునకు భార్యాభర్తలిద్దరూ రెండు చక్రములని వారి భావము. అయితే వివాహము జీవితమునకుప్రధాన ఘట్టమన్నది ఎంత నిజమో' అదే జీవన పరమార్థముకాదన్నది కూడ అంతే నిజం! దుర్బల మనస్కయైనస్త్రీకి దుర్భేద్యమైన కోటలాంటి రక్షణ అవసరమని, ఆమెకు కంటికి రెప్పలా కాపాడే రక్షకుడు అవసరమని ఏర్పరచబడిన నియమాలివి. ఈనాటి స్త్రీ స్వయంసిద్ధ. తనేం ...న్యాలో, తనకేం కావాలో యోచించి ఆచరించగల ఆత్మ స్థైర్యం గల అతివ.

గార్హస్థ్యమనే రాజ్యానికి ఆమెరాణి. తనరాజ్యాన్ని రంజకంగా పాలించగల ధీమణికూడ. ఇలా వేదములు సత్యార్థ ప్రతిపాదకములు, సర్వజన హితకరములు. సర్వ శంకానివారకములు, స్త్రీలు, శూద్రులు, సర్వ మానవులును వేదాధ్యయనమునకు సమానయోగ్యులు అని వేదమంత్రములు స్పష్టపర్చుచున్నవి. వేదములో బ్రహ్మావాదినులైన స్త్రీ లెందరో కలరు.

''ద్వివిధాః స్త్రియః బ్రహ్మావాదిన్యః సద్యోవధ్వశ్చ! తత్ర బ్రహ్మా వాదినీనాం ఉపనయనం, అగ్నింధనం, వేదాధ్యయనం, స్వగృహేభిక్షా చర్యాచ సద్యో వధూనాంతు ఉపసితే వివాహేకాలే కథంచిత్'' అని చెప్పబడింది. బ్రహ్మావాదినులు, వధువులు అని స్త్రీలు రెండు విధములు. అయితే బ్రహ్మావాదినులకు ఉపనయనము, అగ్నింధనము, వేదాధ్యయనము, స్వగృహమున బిక్షస్వీకరించుట విధులు. ఇకవధువులు ఉపనయనానంతరం విద్యార్జన, వివాహము చెప్పబడినవి.

(సశేషం)

---

## 'హరిజనుడు'-శ్రీరామానుజాచార్యులు

కుల,మత భేదాలు లేకుండా '' ఓం నమో నారాయణాయ'' మంత్రాన్ని గుడిగోపురంపైకెక్కి మూడు సార్లు ఉచ్చరించి, ముక్తి కొంత మందికికాదు అందరికీ అన్నాడు. శ్రీరామానుజుడు.

మైసూరులోని నారాయణ విగ్రహాలు మహమ్మదీయులు దండయాత్రగావించి ఢిల్లీకి తీసికొనివెళ్ళగా శ్రీరామానుజులు ఢిల్లీ వెళ్ళి అచటి అధికారులతో వాదించి విగ్రహాన్ని తీసుకొని వచ్చారు మైసూరుకు. కాని శత్రువులు మరలా ఆ విగ్రహాన్ని కాజేయప్రయత్నించగా, రామానుజులవారికి అచటి అస్పృశ్యులనబడే వారు అండగా నిల్చి శత్రువుల ప్రయత్నాన్నివిఫలం చేశారు. అపుడువారికి ( అస్పృశ్యులకు) 'హరిజను' లని నామకరణం చేసినది రామానుజులే.

120 ఏళ్ళు జీవించి శిష్యులకు ధర్మసూత్రాలు బోధిస్తూ కైవల్యం పొందారు. శ్రీరామానుజాచార్యులవారు.

శ్రీరామానుజులవారి జననం క్రీ.శ.1017లో
(మే.11. శ్రీరామానుజ జయంతి)

**- N.V.S.రామానుజం.**

"Our first duty is not to hate ourselves, because to advance we must have faith in ourselves first and then in God. He who has no faith in himself can never have faith in God.

(1.38)

**- Swamy Vivekananda.**

# మనిషి - కర్మనిష్ఠత

-చౌడూరి గోపాలరావు

ఖలునిన్ సజ్జనుగాగ, మూర్ఖజను సంఖ్యావంతునిక్గాగ, దాయలసన్మిత్రులుగా, నగోచరము ప్రత్యక్షంబుగా, ప్రాణహృత్క్ష్వేలనంబైన మహావిషం బమృతంబుగా జేయు, సత్కర్మము జ్వలనిషానిధి వైభజింపుము, వయస్యావాంఛితార్థాప్తికిక్. దుర్జనుడి సజ్జనుడిగా, మూర్ఖుని విద్వాంసునిగా, శత్రువును మిత్రునిగా, కనుపించనివి కనిపింపజేయునదిగా, విషమును అమృతంబుగా, జేయగలశక్తి మానవకర్మలకున్నది. వాటి ఆచరణచే కోరికలు తీమనని భర్తృహరి అంటాడు.

వేదభవనము, త్రికాండములపై ఆధారపడి ఉందంటారు, కాండమంటే స్థంభము. జ్ఞాన, భక్తి, కర్మలనే త్రికాండము లంటారు వేదవేత్తలు మన పూర్వులు కుర్వన్నేవేహకర్మాణి జిజీవిషేత్ శతగుమ్‌సమాః'' అనే వేదమంత్రాన్ని ఉదహరిస్తారు. మానవుడు బ్రతికినంతకాలం, కర్మలు చేస్తూనే ఉండాలని మంత్రార్థం భగవద్గీత కూడా కర్మలని వార్యమంటూంది. భారతీయులు ఈ కర్మ సిద్ధాంతాన్నివదిలి నిష్క్రియను నెర్పే పివృతికత వేదాంతాన్ని అనుసరించటంవల్ల బానిసలైపోయారని అరవిందుడంటాడు. కర్మలు ప్రవర్తించే విధంతెలియాలి.

మనం చేస్తున్న పనికి కారణమైన కోరికలు, ఆలోచనలు, నిండిన ఒక శక్తి వీటి వేనక ఉంటుంది. ఆశక్తినే వాసన అంటారు. ఈ వాసనలు అంతర్గత ప్రవృత్తులవల్ల ఉద్భవిస్తాయి. వీటి చర్యలు బలీయమైనవి. అయినా వాటిని మార్చుకొనే శక్తి మానవుడి కొక్కడికే ఉంది. మానవశక్తినుపయోగించి వాసనల త్రోసి రాజని చేసే కర్మలే నిష్కామకర్మలుగా గీత నిర్వచించింది. వాసనగత శక్తి అవుతే, నిష్కామ కర్మ భవిష్యత్ శక్తి అంటే మనిషి కర్మలో స్వతంత్రుడన్న మాట, ఫలితంలో మాత్రం పరాధీనుడు. ఉదాహరణంగా తినేస్వాతంత్ర్యం నాకుంది, ఎక్కువ తిన్నందువల్ల వచ్చే అజీర్ణబాధ నాచేతిలో లేదు.

కర్మలు అంటే చేస్తున్నపనులు అన్నికర్మలు వాటి వాటి ప్రభావం కలిగి ఉంటాయి. ఇది గమనించిన గీతాచార్యుడు యజ్ఞదాన, తపఃకర్మ, నత్యాజ్యం కార్యమేవతత్'' అంటాడు. వీటివల్ల మృత్యువును తరించి జ్ఞానముతో అమృతత్వము పొందవచ్చునంటొంది వేదం. ''అవిద్యయామృత్యుం తీర్త్వా, విద్యయా అమృతమశ్నుతే'' అవిద్య అంటే వేదవిహిత కర్మలు. జ్ఞానకర్మల సముచ్చయమే వైదిక విజ్ఞానము.

బ్రహ్మజ్ఞానం రెండురకాలు. శౌనకడను విద్యార్థి అంగిరసుడను గురువును సమీపించి ''కస్మిన్నుభగవో! విజ్ఞాతే సర్వమిదం, విజ్ఞాతం భవతి'', ఓ భగవాన్ ఏది తెలుసుకొంటే సర్వం తెలుస్తుంది అని ప్రశ్నిస్తే, బ్రహ్మజ్ఞానంవల్ల తెలుస్తుందంటాడు. అది రెండు విధాలంటాడు. ''ద్వేవిద్యే వేదితవ్యే, పరాచైవా, పరాచేతి, ఒకటి పరవిద్య రెండవది అపరవిద్య, అపరవిద్య లోకవిహితవైదిక కర్మలు. పర విద్య బ్రహ్మతత్వము. ఈ రెండింటిలో ఏదివిడిచినా అమృతత్వము సిద్ధించదన్నారు. ఈరెండు కలిసినడిచినప్పుడే జాతిక్రియావంతమౌతుందంటారు. వైదిక కాలంలో క్రియాశీలత కర్మనిష్ఠత, జ్ఞానవంతమైయుండేదని చరిత్ర చెబుతున్నది.

కర్మకాండను వదిలి, కేవలం వాచావేదాంతులంకాగానే మనిషిలో ఆశలు ప్రారంభమౌతాయి, అల్పమైన ఆశలసాధనకు ఈ విద్యలనే వినియోగించటం ప్రారంభిస్తాము. చరిత్రను గమనిస్తే మన దేశం రానురాను క్రియాశీలతను గోల్పోయి తన చుట్టూ ఉన్న సమాజదర్శనం చేయలేకపోతున్నది. తన కోసం వండుకోవడం పాపం అన్న గీతామాత పుట్టిన దేశంలో, పేదతనం, అజ్ఞానం,

అంటరానితనం, ఆకలి, ఉచ్చనీచాలు, మూఢాచారాలు, చాందసాలు, దేశకాల పరిస్థితులను గమనించేశక్తి లేకపోవడం వ్యక్తిలోని జీవన మాధుర్యాన్ని శుష్కింపజేస్తున్నాయి. అనేకవలయాలు అతడిని చుట్టుకొంటున్నాయి.

అందుకే వివేకానందుడు, అమేరికాలో మాట్లాడుతూ ఈ వైపరీత్యంచూడండి. యూరపు దేశీయుల దైవమగు క్రీస్తు ఎవ్వరి నేని శత్రువుగా నెంచకుడు, మిమ్ముదూషించువానిని, దీవింపుడు, కర్మ ప్రసక్తినంతయు మానుకొని, పరలోకమునకేగ సంసిద్ధుడవుకమ్ము, అని బోధించెను. మా దేశంలోని గీతాచార్యుడు పరిపూర్ణోత్సాహముతో సర్వదా కర్మలొనర్చుము. ధర్మశత్రువులను పరిమార్చి లోకమును భోగింపుము. ధర్మమును రక్షింపుము అది నిన్ను రక్షించునన్నాడు కాని గీతను పాశ్చాత్యులు, బైబిలును భారతీయులు ఆచరించుచున్నారంటాడు. మన క్రియా రాహిత్యాన్ని గమనించిన వివేకానందుడు. కర్మలు రెండు రకాలు, మంచి చెడు, మంచి కర్మలంటే, వేదోక్తకర్మలు, వాటి ఆచరణ ద్వారా సమాజం సుఖశాంతులతో ఉంటుంది. ఈ కర్మలు, నిత్య, నైమిత్తిక, కామ్యకర్మలుగా విభజించారు మనపెద్దలు. యమనియమాలు అంటే సంఘదృష్ట్యా చేయవలసిన కర్మలు, నియమాలు వ్యక్తిత్వ కారణమునకై చేయదగినవన్నారు. చేస్తున్న కర్మలు ఎందుకు? నాసంసారంగడవాటినికి, అనేది మూడవస్థాయి కర్మ, నేను చేస్తున్న పనివల్ల ఈ సమాజం మారాలి అనేది రెండవస్థాయి కర్మ. నాకర్మ నాసహజాతం ఇతరులకుపయోగపడితే మంచిది నేను వీటిని చేయటానికే జన్మించాను అన్నది మొదటి స్థాయికర్మ. ఈ మూడింటిలో మూడవది యోగిత్వము అన్నారు స్వామి చిన్మయానంద. వీరి సంఖ్య పెరిగినకొలది సమాజం వైభవంగా ఉంటుంది. ఈ లాంటి కర్మిష్టులు దేశం నాకేమిచ్చిందని ప్రశ్నించరు, దేశానికి నేనేమిచ్చానని పరిశీలిస్తారు. అందుకే వేదం మనిషిని కర్మయోగి కమ్మంటుంది.

( ఆకాశవాణి – హైద్రాబాద్ – సౌజన్యంతో)

---

# సొల్మన్ చక్రవర్తి జెరుసలేంలో ఈశ్వరాలయం నిర్మించాడు.

(రాజన్)

**1.** సొల్మన్ చక్రవర్తి జెరుసలేంలో నిర్మింపజేసిన 'ఈశ్వరా'లయం విదేశీ దండయాత్రలలో నాశనమైంది.

**2.** 'ఈశ్వరా'లయం నుండే 'ఇస్రాయేల్' అనే పేరు వచ్చింది. పూర్వం ' ఇస్రాలియా, ఇస్రాల్యా' క్రమంగా 'ఇజ్రాయల్' అయింది. 'ఈశ్వర ఆలయం' ఉచ్చారణ దోషంతో ' ఇస్రాయల్' అయింది. 'ఈశ్వర' ఆలయప్రదేశం 'ఇషా' 'ఇసా' గా పేరొందినేటికి 'ఇస్రాయల్'లో ప్రతీతి అయింది.

**3.** సొల్మన్ ఈశ్వరాలయం నిర్మించిన ప్రదేశమే నేడు 'జెరుసలేం' లేక 'యెరుసలేం' అయింది. ఇదికూడా సంస్కృత పదం 'శ్రీశైలం' నుండి ఏర్పడ్డ పదమే. సంస్కృత 'ష' (Sha) ఇతర భాషలో 'ఝ'(Zha)అయింది. రానురాను 'ఝ' జ(Ja), య(ya)గా మారింది. భారతదేశంలో గూడ 'య' 'జ' లు పూరకములు.

ఉదా: యాదవ్=జాదవ్, మరియు యమున=జమున.

**4.** సొల్మన్ చక్రవర్తి హిందువు. ఆయన నామం 'సులోమ' ( భవిష్యపురాణం) అరబిక్‌లో ఆయన 'సులైమాన్'గా ఎరుగుదురు. ఇదికూడా భారతీయ మూలమే. ( ఉదా:హనుమాన్, కీర్తిమాన్, శ్రీమాన్ మొ॥)

# శ్రీగుండ్ల బ్రహ్మేశ్వరాలయము

(వెలుగోడు, నారాయణాపురం, చిన్నదేవలాపురం)

ప్రకృతి రమణీయతతోశోభిల్లి దట్టమైన నల్లమల కొండలలో అతిప్రాచీనమైన (క్రీ.శ.753) శ్రీ బ్రహ్మేశ్వర శివలింగముతో జీర్ణాలయ క్షేత్రమున్నది. దీని సమీపములోనే గుండ్లకమ్మ నది పారుచున్నది. ఈ క్షేత్రస్థల పురాణమును పరికించగా ఈ క్షేత్రములో బ్రహ్మేశ్వర శివలింగమును అలనాడు ద్వాపరయుగములో మహాభారతయుద్ధం ముగిసిన తర్వాత దుర్యోధనుని వధానంతరము ద్రోణసుతుడైన అశ్వత్థామ రాజరాజు ఆత్మశాంతికై పాండవ వంశ నిర్మూలనకై నిదురించుచున్న పసికందులైన ఉప పాండవులను హత్యచేసి, ద్రౌపది వెలిబుచ్చిన గురుపుత్ర హత్యాపాపము అన్న వాదముపై అర్జునుని చేత చావుతప్పించుకొని శిశుహత్య పాప పరిహారార్థము శ్రీకృష్ణపరమాత్మ సలహాతో ఇక్కడ బ్రహ్మేశ్వరుడనే పేరున శివలింగ ప్రతిష్ఠ చేశాడు. ఈ క్షేత్రమునకు తర్వాత కాలములో చాళుక్య ప్రభువులు విచ్చేసి శ్రీ బ్రహ్మేశ్వరుని ఆరాధించి శ్రీ స్వామి అనుగ్రహమునకు పాత్రులైనారు. చాళుక్య ప్రభువులు శ్రీ బ్రహ్మేశ్వరుని కొలిచినట్లు శిలాశాసనము కూడా యీనాటికి దేవాలయము ప్రక్కననే యున్నది. గుండ్లకమ్మనది తీరానగల యీ క్షేత్రమును గుండ్లబ్రహ్మేశ్వర క్షేత్రముగా యీనాటికి జనులు పిలుస్తుంటారు.

ఈ గుండ్లబ్రహ్మేశ్వర క్షేత్రము కర్నూలు జిల్లా వెలుగోడు నుండి చలమనుండి **24** మైళ్లు ప్రకాశం జిల్లా దిగువ మెట్ట నుండి మరియు పాపినేనిపల్లె నుండియు **24** మైళ్ళ దూరములో నల్లమల కొండలమధ్యలో యున్నది. వెలుగోడు నుండి దిగువమెట్ట నుండి లారీలు తదితర వాహనములు ప్రయాణించే ఫారెస్టు రోడ్డు యున్నది.

జీర్ణదశలోయున్న ఈ పురాతనక్షేత్రమును పునరుద్ధరించు సదుద్దేశ్యముతో స్థానిక నంద్యాల పార్లమెంటు సభ్యులు శ్రీమద్దూరు సుబ్బారెడ్డిగారి అధ్యక్షతన బ్రహ్మేశ్వరాలయ జీర్ణోద్ధరణ కమిటీ యేర్పడినది. ఈ కార్యక్రమమునకు **31-5-1985**న శంఖుస్థాపన చేయబడినది.

– సేకరణ **వెంకటరెడ్డి.**

---

# కుత్సితపుక్రైస్తవ కూటములకు సహేతుకమైన సవాల్

స్వస్థత కూటముల పేరిట తరచుకొందరు క్రైస్తవ బాబాలు ఉపన్యాసాలు యిచ్చి కుంటివారిని నడిపిస్తామని, గుడ్డివారికి చూపు యిప్పిస్తామని చెప్పి డబ్బువసూలు చేసుక పోతుంటారు. అమెరికా యూరప్ దేశాలలలో కూడా అలాంటి స్వస్థత మహాసభలు అప్పుడప్పుడు పెట్టడం జరుగుతంది. జేమ్స్‌రాండి అడుగుతున్నది ఒకటే. ఎవరిని నయం చేస్తామంటున్నారో. ఆరోగి నిజంగా జబ్బున్నవాడా అనేది ముందుగాతెలుసుకోవాలి. లేదా ఒక కుంటి, గుడ్డి, వికలాంగుడిని మనమే తీసుకువస్తాం. వారిని నయం చేయమనండి. మధ్యవర్తి డాక్టర్ల సమక్షంలో యిది జరిగితే స్వస్థత కూటాలలో నిజం ఎంతో బయట పడుతుంది. అని సవాల్ చేయుచున్నాడు జేమ్స్‌రాండి. ఆయన సవాల్‌ను ఎదుర్కోని ఎవరూ ముందుకు రాలేదు. బ్యాంక్‌లో **10** వేల డాలర్లు పెట్టాడు. అమెరికాలోనే గాదు. ఇండియాతో సహా ప్రపంచంలో ఎక్కడైనా యిలాంటి మహత్తులు రుజువుచేసి ఆ డబ్బు తీసుకోమంటున్నాడు. (అడ్రస్ **12000** ఎన్ డబ్ల్యు. 8వ స్ట్రీట్, ప్లాంటేషన్, ఫ్లోరిడా **33315- 1406** యు.ఎస్.ఎ.)

సేకరణ : చేరెడ్డి శ్రీరామరెడ్డి

# మానవసేవ పేరుతో...

నలభై ఏళ్ళ క్రితం, మధర్ థెరిసా అనే పేరుగల ఒక రోమన్ కాథలిక్ చర్చ్‌కి చెందిన ఒక విదేశీ ఏజెంట్ కలకత్తా వచ్చింది. వాటికన్ సిటీ నుండి వచ్చే ఆదేశానికి, అమెరికా నుండి వచ్చే ధన సహాయంతో అమలు చేయడమే ఆమె పని. ''మిషనరీస్ ఆఫ్ చారిటీస్'' అనే పేరుతో మన భారత జాతిని మొదట సాంస్కృతికంగా తర్వాత రాజకీయంగా నాశనం చేయడానికి ప్రయత్నం చేస్తున్నారు. అమెరికా నుండి ఈ స్వచ్ఛంద సంస్థకు డబ్బు ఎందుకు చేరుతుంది? "Fera' యొక్క నియమాల ప్రకారంగా విదేశీల నుండి వచ్చే విదేశీ డబ్బు చెందడానికి ప్రభుత్వం నుండి అనుమతి తీసుకోవలసి వస్తుంది. కానీ, ''మిషనరీస్ ఆఫ్ చారిటీ'' అనే సంస్థకు ఈ నియమం ఎందుకు వర్తించదు?

ఇది ఒక అంతర్జాతీయ కుట్ర దీనిలో అమెరికా మరియు వాటికన్‌లోని రోమన్ కాథలిక్ చర్చ్ ప్రముఖ పాత్రలు వహిస్తున్నారు. పాశ్చాత్య సామ్రాజ్యవాదుల సైన్యము చతురంగసేన, ఇలావుంటుంది. ఆర్మీ, నేవీ, ఏర్ ఫోర్స్, మరియు చర్చీ. చర్చీ ఆధారంగా వీళ్ళు రాజకీయంలో వాళ్ళ స్థానాన్ని స్థిర పరచుకుంటారు.

హిందువులలో ఉన్న అశ్రద్ధ, అనైక్యత, మరియు ఆత్మగ్లాని వలన వీరిని మతమార్పిడి చేయడం అనేది చాలా సులభం. ఈ విషయాన్ని చక్కగా అర్థం చేసుకుని ఇప్పటివరకు లక్షలాది హిందువులను క్రైస్తవులుగా మార్చారు. ఇదే వారి ''మానవ సేవ''.

అమెరికా వారికి తను చేసిన సేవను దృష్టిలో పెట్టుకొని ఆ ప్రభుత్వం భారత దేశంలోని నాయకుల పై ఒత్తిడి చేసి ''భారతరత్న'' మరియు ''బిరసా యుండా అవార్డు'' ను ఇప్పించారు, థెరీసాకు.

మదర్ థెరీసా చేసే 'మానవసేవ' హిందువులకే పరిమితమై ఉన్నది. కానీ ముస్లిములు ఎంత బీద వారైనా మత మార్పిడికి గురికారు. అందువలన వాళ్ళకు సేవ చెయ్యరు.

శ్రీమతి సోనియా గాంధీ (కేథలిక్ క్రిస్టియన్-ఈమె నిజం పేరు ఎవరికి తెలియదు.) మదర్ థెరిస్సాతో కలిసి మొత్తం భారతజాతిని క్రైస్తవంగా మార్చడానికి కంకణ బద్ధులై ఉన్నట్లున్నారు.

పాకిస్తాన్ మరియు బాంగ్లాదేశ్ లాంటి ముస్లిమ్ దేశాలలో మతమార్పిడిని నేరం క్రింద భావిస్తారు. ఏరోజు మన భారతదేశంలో అలాంటి చట్టం వస్తుందో, ఆరోజు నుంచి మనకు మంచి రోజులు వస్తాయి.

హింది (రైటర్స్) ఫోరమ్ ద్వారా ఒక పుస్తకము వ్రాయడము జరిగింది, దాని పేరు (Vatican-Teresa-Sonia), వాటికన్-థెరిస్సా-సోనియా. ఈ పుస్తకాల్లో హిందువులను ఎలామోసము చేస్తున్నారో వ్రాయబడి ఉన్నది.

మానవ సేవ పేరుతో మన జాతిని సర్వనాశనం చేసే జాతిద్రోహులలో మదర్ థెరిస్సా మొదట స్థానంలో, మన చరిత్రలో వ్రాయబడును దీనిలో ఏమి అనుమానము లేదు.

ప్రమోద్ వళసంగకర్,
దిల్‌సుఖ్‌నగర్.

# నవోదయం

సదల వాట్ల సాయంతో...
సంస్కారాలు పెంచుకో!
స్వేదంలో రేపటినీ...
స్వర్గంలా తీర్చుకో!
అధోగతికి, అందలాలకు!
అలవాట్లే మూలాధారం.
ప్రగతి ఎలా?! అనే ప్రశ్నకు?!
సదలవాట్లె సమాధానం.. ॥సదల॥
(1) సాంప్రదాయ, సంస్కృతులూ...
సకల మతాచారాలూ...
అనాదిగా ... నరుల నరాల్లో...
జీర్ణించి నలవాట్లే..... ॥సదల।
(2) కుల-మత-ప్రాంతీయ - భాషల
మారణ హోమాలు జగతిలో
సదల వాట్ల నభ్యసిస్తే!!!
రూపు మాసి నవోదయం ॥సదల॥

– అబ్దుల్ అజీజ్

# క్రైస్తవ మత ప్రచారం

ప్రభుత్వ (సెక్యులర్) ఉన్నత పాఠశాలలో

**22-3-97** క్రైస్తవ మత ప్రచారకులు నల్లగొండ జిల్లా, యాదగిరిగుట్ట (హైందవ పుణ్యక్షేత్రం) ప్రభుత్వ ఉన్నత పాఠశాలలో ఉ॥10గం॥లకు 'గిద్యాను ఇంటర్నేషనల్ ఆఫ్ ఇండియా' సంస్థకు చెందిన 'కొత్తనిబంధన' (బైబిల్ గ్రంథం) లు శ్రీ జోసఫ్, శ్రీపుష్పనాథం, శ్రీకాంతారావు, శ్రీప్రభుదాసులను క్రైస్తవమత ప్రచారకులు తెచ్చి పాఠశాలప్రధానోపాధ్యాయుని అనుమతిలేకుండానే ఆపాఠశాల డ్రిల్లు మాష్టరు శ్రీ K.D. ప్రసాదరావు సహకారంతో, కొన్ని పంచిపెట్టడం జరిగింది.

ఇది గమనించిన స్థానిక స్వయంసేవకులు శ్రీ సురేశ్, శ్రీరాము మొ॥వారు వచ్చి సెక్యులర్ పాఠశాలలో మతప్రచారం నేరమని వాదించి మిగతా బైబిల్స్ పంచడం ఆపివేశారు.

ఆపాఠశాల డ్రిల్లు మాష్టరు శ్రీ K.D. ప్రసాద్‌రావుపై తగిన చర్య తీసికొనవలసిందిగా విశ్వహిందూ పరిషత్‌వారు సంబంధిత అధికారులకు వినతిపత్రాలు సమర్పించారు.

**25-3-97**న.RSS; ABVP.మాజీవిద్యార్థుల అసోసియేషన్ అధ్వర్యంలో పాఠశాల తరగతుల బహిష్కరణ, ప్రదర్శన రాస్తారోకో జరిగింది. MROకు వినతి పత్రం సమర్పించి శ్రీK.D. ప్రసాద్‌రావును సస్పెండు చేయమని డిమాండ్ చేశారు అని శ్రీరచ్చ సురేశ్ తెలియజేశారు- యాదగిరి గుట్ట.

# సెక్యులర్ వ్యవస్థా హిందూ ఆలయాల దురవస్థా ?

ఆర్యా :

'మనది సెక్యులర్ రాజ్యాంగం' అంటూ గావుకేకలు పెట్టే 'కుహనా లౌకిక వాదులు' పదవులు రాగానే దేవాలయం దర్శనం - ప్రదక్షిణలూ చేస్తారు! పూర్ణకుంభస్వాగతాలూ - అర్చకుల మహదాశీర్వచనాలూ-శేషవస్త్రాల పేరుతో అత్యంత విలువగల పట్టు వస్త్రాలు స్వీకరిస్తారు!

కానీ, 'సింహాసనం ఎక్కేటప్పటికి మనసుమారి హిందువులు మత మౌఢ్యం కలవారిగా - ఆలయార్చకులు దుష్టభూతాలుగా కనిపిస్తారు? ఈ నీచరాజకీవయ వాదులు తిరుపతి వేకంటేశ్వర స్వామికి ఐనా 'పరిపూర్ణ తిరుక్షవరం' చేస్తారు!

ఈ దుష్ట-నికృష్ట-పాపిష్టి-నీతిరహిత-దైవ భీతి విహీన రాజకీయ వేత్తలు! పరమ దుర్మార్గులు; వీరికన్నా బందిపోట్లు ఎన్నో కోట్ల రెట్లు ఉత్తములు! ఎందుకంటే - బందిపోట్లు వస్తే ఏమి చేస్తారో జనానికి తెలుసు! ఈ క్షుద్ర రాజకీయ వేత్తలు ప్రజల్ని స్వర్గసౌఖ్యాల్లో ముంచుతామంటారు - తీరా చూస్తే పాతాళంలోకి దించుతారు!

వీళ్ళకంటే వేశ్యలు కోటాను కోట్ల రెట్లు మేలైనవారు! ఎందుకంటే జీవనం కోసం వారు దేహాన్ని అమ్ముకుంటారు! మరి ఈ దౌర్భాగ్య నయవంచకులు దేశమాతనూ; సంస్కృతీ మూల్యాలనూ నీచులై అమ్ముకొని కోట్ల రూపాయల ధనాన్ని నీతి విహీనులై పరదేశాల్లో బ్యాంకుల్లో దాచుకుంటారు.

ఈ హిందూ ధర్మ వంచకులు ఎన్నికలు రాగానే ఇతర మతాధిపతుల పాదాలను ఆశ్రయిస్తారు! పరమతాల వారికి 'తాయిలాలు' ప్రకటిస్తారు ఓట్ల కోసం!

ఇతరమతాల వారి 'ఆరాధనా స్థలాల' జోలికి పోలేని పిఱికి పందలగు 'ఉత్తరకుమారులకు' హిందూ దేవాలయ వ్యవస్థను పాలించే అర్హత వున్నదా?

ఓ! హిందూ వ్యతిరేక రాబందుల్లారా! హిందూ దేవాలయాలపై వుంచిన మీ 'భస్మాసురహస్తాన్ని' వెనకకు తీసుకోండి! లేకపోతే ప్రళయ జంఝామారుతంలో కొట్టుకు పోయి సమూల వినాశనం పొందుతారు. మహోద్యమం రాబోతూవున్నది! ఎక్కువ వోట్లు వచ్చిన వాళ్లు గెలుస్తున్నప్పుడూ- ఎక్కువ సీట్లు వచ్చిన వాళ్ళు ప్రభుత్వాలను ఏర్పరచేటప్పుడే - ఎక్కువ మంది వుండివ హిందూ ధర్మ విశ్వాసాలకు అనుగుణంగా రాజ్యాంగమూ - పరిపాలనా వుండవలసిన అవసరం లేదా?

హిందువులు తమ జన్మించిన దేశంలోనే ద్వితీయ స్థాయి పౌరులుగా జీవించి బాధలనుభవించవచ్చునా?

— ఈమని సువర్ణం

''స్వదేశీ వస్తువులే కొనాలి
విదేశీ వస్తువులు మానాలి
భారతీయుడుగా మనాలి
హిందువుగా జీవించాలి''.

*గమనిక:* ఈ పత్రికలోని రచయితల అభిప్రాయములు వారిస్వంతములే. పత్రికాసంపాదకులు, యాజమాన్య ము ఏకీభవించక పోవచ్చును.

సం.

# భారత్ మహాన్!

– మితింటి

పాండవులెంత మందని అడిగితే తప్పుచెప్పిన వాళ్ని చూసిన నవ్వుకున్నా తప్పులేదు. స్వాతంత్ర్యానంతరం మన నాగరికత తెచ్చిన మలుపు. మాన ధర్మ నిరపేక్ష రాజ్య పాలకులకు దేశీయ మక్కువకు మచ్చు. యావద్ప్రపంచమునందు వలెనే మన ఆర్యావర్తము భౌతికంగా, సామాజికముగా, నైతికముగా, ఎంతదిగజారినదంటే పూర్వ ప్రధానమంత్రి అనేక కోట్ల (Scams) ఆర్థిక అన్యాక్రాంతమునందు ముద్దాయిలు. యథారాజ తథాప్రజా అన్నట్లు రాష్ట్ర రాష్ట్రమునను యీ ఉమ్మెత్త పువ్వులు వికసిస్తూనే ఉన్నాయి.

మనదేశము యొక్క అంతర్గత విషయం–అవినీతి మరి మనదేశమును ఇరుగుపొరుగులు ఆక్రమించుకొనుట తన అంతర్జాతీయ రాజకీయ విఫలతకు నిదర్శనమైనను దేశనేతలో భారత రత్నములై వెలుగొందు ప్రాతఃస్మరణీయులు కదా! ప్రజారాజ్యమునందు ప్రజలే న్యాయనిర్ణేతలు! ఇది నైతిక సామాజిక పతనత కదా!

భౌతిక లేక భౌగోళికముగా జరిగి అన్యాయాములను దిగమ్రింగు ధీరులైన భారతీయులకు దుఃఖకారణము. గాంధారము ( ఆఫఘనిస్తాన్) నుండి అమృత్‌సర్ వరకు ఉత్తరమునకాగా దక్షిణమున శ్రీ లంకజీవి పోయింది, బర్మా చిదిమి వేశారు. హిందువులను కత్తితో టోకాసుతోటో మాల్దీవులు, డీగో గ్రేషియాలు పరావర్తనమయ్యాడు. తూర్పున మగదేశము బంగ్లాదేశ్ అయ్యిన కథమనకి తెలుసు. మనం నిత్యం స్నానం–అంటే కొంత మంది వారానికోసారి చేస్తారుట–అప్పుడు పవిత్ర గంగతో సింధును కూడా తలుస్తామే–అది **1947**లో చెయ్యి జారింది. చైనావారుటిబెట్టుకైవాసాలను హస్తగతం చేసుకున్నారు కదా! కొన్ని వలే చతురకిలో మీటర్ల భూమిని పాకిస్తాన్, చైనాలు హస్తగతం చేసుకున్న విషయంలో కవిదితమే! బంగ్లాదేశ్‌కు **1961** 'బేరుబారి' ధారాదత్తం జరిగింది. లడఖ్‌నుండి అస్సాము వరకు భాయి భాయి అంటునా **1962** చైనా ఆక్రమించుకుంది. 'రాణ్ ఆఫ్ కచ్ఛ్' గుజరాత్ రాష్ట్ర భూగాన్ని **1966**లో పాకిస్తాన్‌కు సమర్పించేరు. 'తీన్‌బీగా జరూన్' – ఇది సనీమాకాదు– పశ్చిమబంగ్లాదేశ్ భాగాన్ని బంగ్లాదేశ్‌కు ధారాదత్తం చేసేరు. సిక్కింపై మన ఆదిపత్యాన్ని గుర్తించని భాయి మనకుతో నిత్య శతృత్త్వగల పాకిస్తాన్‌కు పరమ మిత్రుడై మారణాయుధాలు, అణ్వాయుధాలయుపకరణాలు నిరంతరము సరఫరా చేసే సాలానుతాము అంటాము. ఇదంతా మనదేశమునకు అంతర్జాతీయ ఖ్యాతి, స్థాయికై స్వార్థ కీర్తి కండూతితో నాయకులు శతృవులతో చెయ్యి కలిపి మతృద్రోహము, దేశద్రోహము చేసే సౌరానడానికి బదులు ఏనుగునకు నల్లమందులా మనకి భారత్ మహన్ అనమన్నారు–అంటున్నాం!

---

**గ్రంథపరిచయం : 'కవిగారి స్వగతాలు' (కవితా సంకలనం)**

రచయిత: 'కవిగారు' ( ఆకునూరు గోపాలకిషన్‌గారు)

తన కుటుంబ సభ్యులందరిని ఆత్మీయభావంతో కవిత్వాల్లో పేరు పేరున పలికరించుకున్నారు కవిగారు, తన **90** పుటల గ్రంథంలో– వెల: రు.**50**/– ప్రాప్తిస్థానం:– 'కవిగారు'

'అమ్మ కృప' 97 వాసవీకాలనీ

సికింద్రాబాద్ – **15**.

# విదేశీ దురాక్రమణదారులు మందిరాల స్థానంలో నిర్మించిన కట్టడాలు - ఇవి అవమానాలా - ఆభరణాలా?

**ఉత్తరప్రదేశ్**

ఉత్తరప్రదేశ్ విషయం చెప్పనే అక్కరలేదు. ముస్లిం దురాక్రమణ దారులతో నిరంతరం సంఘర్షించిన ఈ గంగా పరివాహక ప్రాంతంలో అనేక నగరాల పేర్లే మారిపోయాయి. ఫతేపూర్ సిక్రీ, అలీగఢ్, ఫిరోజాబాద్, అలహాబాద్, అజమ్‌గఢ్, ఫరూఖాబాద్, గాదీపూర్, ఫతేపూర్, జౌల్‌పూర్, ముజఫర్‌నగర్, మురాదాబాద్ వంటి నగరాలు ఒకప్పుడు హిందూపేర్లతో ఉండేవి. హిందువులకు అత్యంత ఆరాధ్యాలైన కాశీ, మధుర, అయోధ్య మందిరాలు ఈ రాష్ట్రంలోనే ఉన్నాయి. అక్బర్ నిర్మించినట్లుగా చెప్పే ఫతేపూర్‌లో అంబియావాలీ మసీద్, జామీమసీద్, షేక్ సలీమ్ చిష్తీ యొక్క దర్గా వీటితో పాటు సికందరాలోని అక్బర్ సమాధి హిందూ మందిరాలను కూల్చి వాటి భగ్నావశేషాలపై నిర్మించినవే. లేదా ఆ మందిరాల భగ్నఖండాలతో కట్టుకున్న మసీదులే. త్రివేణిసంగమానికి పేరెన్నికగన్న అలహాబాద్‌లోని ఖుస్రూబాగ్‌షా అజ్‌మల్‌ఖాన్ యొక్క దర్గా, స్మశాన వాటిక, ఖుస్రూబాగ్, అక్బర్ నిర్మించిన కోట ఇలా నిర్మించినవే. అయోధ్యలో తథాకథిత బాబరీ మసీద్ ప్రపంచ ప్రఖ్యాతి పొందిన విషయం తెలిసిందే. అదే అయోధ్యలో స్వర్గద్వార మందిర స్థలంపై ఠాకూర్ మందిర స్థలంపైన మణిపర్వతం పైయిన ముస్లిం దురాక్రమణ దారులు నిర్మించిన ఔరంగజేబీ మసీదులు శీర్ పైగంబర్, అయూబ్‌పైగంబర్‌ల దర్గాలు, మజార్‌లు కూడా ఉన్నాయని చాలా మందికి తెలియదు.

కేవలం వారణాసి నగరంలోని జ్ఞానవాపి విశ్వేశ్వర మందిరంతోపాటు కిరీట విశ్వేశ్వర మందిర భగ్నావశేషాలపై నిర్మించిన పంచగంగా ఘాట్ మసీద్, బిందుమాధవ మందిర భగ్నావశేషాలపై నిర్మించిన బిందుమాధవ మసీద్, లాల్‌ఖాన్‌కి మజార్, అఢాయి కంగురా మసీద్, ఒకరియా కుండ్ మసీద్‌లు కూడా ఉన్నాయి. ఇలా జాబితా తయారు చేస్తే ఈ దేశంలోవేయేండ్ల ఇస్లామిక్ దురాక్రమణ కాలంలో అడుగడుగునా వారు మిగిల్చిన అవమానాల చిహ్నాలు కనిపిస్తాయి.

## "మాతృభూమి కోసం...."

''హిందువు హిందువుగా ఉండేంత వరకే అతడు భారతదేశ రక్షణార్థం తన ప్రాణాలనైనా అర్పించి సర్వస్వాన్ని హోమించేయగలడు. ప్రియమైన మాతృభూమి కోసం అతడు తన ప్రాణార్పణ చేయడం ద్వారానే స్వర్గాన్ని లేదా మోక్షాన్ని కోరుకుంటారు. కాని అతడే మతం మార్చుకొని ఏ ముస్లిమో, క్రైస్తవుడో అయితే యిక యీ మట్టిదిబ్బలను రక్షించడానికి తన ప్రాణాలెందుకిస్తాడు? అతనికి పుణ్యభూమి కాశీకాక మక్కా, మదినా అవుతుంది. కనుక ఈ దేశం యొక్క రాష్ట్రీయుడు, అసలైన భక్తుడు హిందువేనని స్పష్టంగా అర్థం చేసుకోవాలి''

– వీరసావర్కార్

(మే 20. వీరసా వర్కార్ జయంతి)

# ప్రకృతి చికిత్సాసిద్ధాంతం, భూమిక

–డాక్టర్ గంగాపురం హరిహరనాథ్

హైదరాబాదు సమీపంలోని శివరాంపల్లిలోగల కస్తూరిబా ప్రకృతి చికిత్సాకేంద్రాన్ని ఈ మధ్య దర్శించడం జరిగింది. దాని పర్యవేక్షకులు, ప్రాకృతిక చికిత్సాతత్త్వవిదులు డా॥సురభికుమారస్వామిగారు అక్కడ ప్రవేశపెట్టిన చికిత్సాపద్ధతులను పరిశీలించిన తర్వాత ఈ వైద్యవిధానానికి మూలం యోగ, సాంఖ్యదర్శనాలు, ఆయుర్వేదం అని అవగతమైంది. తత్పర్యవసానమే ఈవ్యాసం.

భారతీయశాస్త్రాలలో ప్రకృతిని గూర్చి విశేషంగా వివేచన చేసిన శాస్త్రం సాంఖ్యదర్శనం. దీనిననుసరించి ప్రకృతి, పురుషుడు అన్న రెండు తత్త్వాలే ఈ చరాచర సృష్టికంతా మూలం. ప్రకృతి జడరూపం. ఇది సత్త్వం, రజస్సు, తమస్సు అనే మూడు గుణాలతో కూడుకొన్నది. పురుషుడు చేతనస్వరూపుడు, నిర్లిప్తుడు. ఈప్రకృతిపురుషుల సంయోగం వల్లనే సృష్టి యేర్పడుతున్నదని దీనిసిద్ధాంతం.

అవ్యక్తమైన ప్రకృతినుండియే వ్యక్తమైన ప్రకృతి పరిణమించింది. మూలప్రకృతినుండి మొదట మహత్తత్త్వం ( బుద్ధి), మహత్తత్త్వంనుండి అహంతత్త్వం ఆవిర్భవించినవి. సాత్త్వికమైన అహంకారంవల్ల మనస్సు, పంచజ్ఞానేంద్రియాలు, రాజసాహంకారం వల్ల పంచకర్మేంద్రియాలు, తామసాహంకారంవల్ల శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనెడి పంచతన్మాత్రలు ఉదయించినవి. ఈ పంచతన్మాత్రలనుండే క్రమంగా ఆకాశం, వాయువు, తేజస్సు, నీరు, పృథ్వి అనే పంచభూతాలు ఏర్పడ్డవి. ఈ విధంగా ప్రకృతి, దాని పరిణామం వల్ల కలిగినవే ఈ 24 తత్త్వాలు. పురుషుడు ( ఆత్మ) 25వ తత్త్వ.

సాంఖ్యము ప్రతిపాదించిన ఈ 25 తత్త్వాలను అంగీకరిస్తూ, ప్రకృతి చిత్తవృత్తులను నిరోధించే ఉపాయాన్ని నిర్దేశించే శాస్త్రం యోగశాస్త్రం. ఇట్లు ప్రకృతిలోని భాగాలైన దేహాన్ని, మనస్సును, వాటి స్వాస్థ్యాన్ని గూర్చి సవిస్తరంగా చర్చించినవి ఈ రెండు దర్శనాలు. సాంఖ్యం సిద్ధాంత (Theory)పక్షం కాగా యోగం సాధన (Practice)పక్షం. మనుష్యుణ్ణి దుఃఖంనుండి విముక్తుణ్ణిచేయడమే సర్వశాస్త్రాలకు గల ప్రయోజనం. అవివేక ప్రభావం వల్ల చేతనుడైన పురుషుడు ప్రకృతితో సంయోగం పొంది, ప్రకృతికి గల సుఖదుఃఖాలను తనవిగా భావించి సంసారబంధంలో చిక్కుకొంటాడు. జడాత్మకం, సుఖ, దుఃఖ, మోహాత్మకమైన ప్రకృతివేరు, చేతనుడు నిర్లిప్తుడు అయిన పురుషుడు వేరు 'అన్న వివేకం కలిగినంతనే పురుషుడు ( ఆత్మ) సంసారబంధంనుండి విడివడి ముక్తుడౌతాడు. దీనివల్ల శాశ్వతంగా దుఃఖనివృత్తి కలుగుతుంది. ఇది పారమార్థికదృష్టి.

లౌకికదృష్టి దీనికంటె కొంత భిన్నమైనది. శరీరధారులైన సాంసారికులకు ధర్మాదిపురుషార్థాలను సాధించేమార్గంలో ఆధి, వ్యాధిరూపమైన తాత్కాలిక దుఃఖాలెన్నో కలుగుతుంటవి. వీటినుండి విముక్తి పొందించడం కూడ శాస్త్రాలకు గల మరొక ముఖ్యప్రయోజనం. కనుక సాంఖ్య, యోగశాస్త్రాల వివేచనాపథంలో ఆయుర్వేదం, ప్రకృతిచికిత్సావిజ్ఞానం వెలసినవి.

ఈ దేహం పంచభూతాలతో నిర్మాణం కావడం వల్ల పంచభూతాల సంతులనం (సామ్యావస్థ) అస్తవ్యస్తమైనపుడు మనుష్యుడు అస్వస్థతకు గురియౌతాడు. ఇదియే దుఃఖానికి కారణం. దీనినే వ్యాధి అని పిలుస్తున్నాం. అస్తవ్యస్తమైన ఈ పంచభూతాల సంతులనాన్ని మరల పంచభూతాల ద్వారా–నీరు, మృత్తిక, సూర్యరశ్మి, ప్రాణవాయువు, ఉపవాసము ద్వారా చికిత్సచేసి, దేహానికి, తద్ద్వారా మనస్సునకు స్వస్థత చేకూర్చడమే ప్రకృతి చికిత్సకు గల లక్ష్యం.

ఆయుర్వేదానుసారం వాతము, పిత్తము, కఫము అనువమూడు దేహమందలి ధాతువులు విషమావస్థకు చేరుకోవడమే వ్యాధి. చికిత్స ద్వారా ఈ వాత, పిత్త, కఫములను మరల సామ్యావస్థకు కొనిరావడమే ఆయుర్వేదానికి గల పరమప్రయోజనం. ఈ విషయాన్నే.

“ధాతుసామ్యక్రియాచోక్తా తంత్రస్యాస్య ప్రయోజనం” అనే ప్రవచనవాక్యం ద్వారా ఆయుర్వేదప్రవర్తకులలో సుప్రసిద్ధుడైన చరకుడు ఉద్ఘోషించినాడు. శరీరాన్ని ధరించడం వలన ఈ వాత, పిత్త, కఫాలే త్రిధాతువులని, అవి విషమావస్థకు చేరుకొన్నప్పుడు త్రిదోషాలని పిలువబడుతున్నవి. పంచభూతాత్మకమైన ఈ దేహమందలి వాయుతత్త్వమే వాతమని, ఉష్ణతత్త్వమే పిత్తమని, జలతత్త్వమే కఫమని పేర్కొనబడుతున్నవి.

శరీరము, మనస్సు రోగానికి గురి అవుతుంటవి. వాతాది త్రిధాతువులను సామ్యావస్థకు తేవడంవల్ల దేహం స్వస్థత పొందగా, జ్ఞాన, విజ్ఞాన, ధైర్య, సమాధులవల్ల రజస్తమోగుణదూషితమైన మనస్సు ఆరోగ్యస్థితికి చేరుకొంటుంది.

చరకసంహితలోని విభాగాలను పరిశీలిస్తే ప్రకృతి చికిత్సలో అది ఎంత ఉపకరిస్తుందో, మార్గదర్శనం చేస్తుందో మనకు తెలియవస్తుంది. చరకసంహిత రెండు ప్రధానభాగాలలో విభక్తమైంది. అవి. 1. స్వస్థవృత్తము, 2. ఆతురవృత్తము. ఆరోగ్యవంతుడు ఆయాదేశకాలాలలో, ఋతువులలో గ్రహింపదగిన యుక్తాహారవిహారాదులు స్వస్థవృత్తంలో నిర్దేశింపబడినవి. రోగనిరోధకప్రక్రియ (Preventive medicine)అంతా ఇందులో విశదీకరించడం వలన ప్రకృతిచికిత్సలో ఇదెంతో తోడ్పడుతుంది. ఆతురవృత్తమంతా రోగగ్రస్తునికి చేసే చికిత్సాతంత్రంతో ఔషధప్రయోగాదులచే నిండి వుంది. ఇట్లే విషయాలను పరిశీలిస్తే, రస, విష, గంధకాదులచే చేసే చికిత్సాంశముతప్ప ఆయుర్వేదం చాలా వరకు ప్రాకృతిక చికిత్స సిద్ధాంతంతో సమన్వయం పొందగలదని తెలుస్తుంది.

(సశేషం)

(కేంద్ర వి.హిం.ప. కార్యదర్శి శ్రీ మోహన్ జోషి భాగ్యనగర్‌లో 12.4.97 పత్రికా గోష్ఠిలో ముఖ్యాంశాలు యీ క్రింద ఇవ్వడమైనది – సం)

“భారతదేశాన్ని పాలించదలచిన ఏ పార్టీ ప్రభుత్వాలైనా మతమార్పిడులు, గోహత్యలు నిషేధించాలి – పాకిస్థాన్ మరియు భారత మతమౌఢ్య ముస్లింల సంతుష్టి విధానాన్ని, కాశ్మీర్, ఈశాన్య రాష్ట్రాలలోని టెర్రరిస్టులను, మరియు బంగ్లా దేశ్‌నుండి భారత్‌లోకి అక్రమ చొరబాటు దార్లను నిరోధించాల్సివుంది.

అలాగే అన్ని రాష్ట్రాల ప్రభుత్వాలు చర్యలు తీసుకోవాలి. పాకిస్థాన్ ఐ.యస్. ఐ విచ్ఛిన్న కార్యకలాపాలు మన దేశమంతా వ్యాపించియున్నాయి. మసీదులు, ముస్లింపాఠశాలలు వారి రహస్య స్థావరాలుగా మారాయి. పాకిస్థాన్ నుండి మారణాయుధాలు దిగుమతి చేస్తున్నాయి.

యుద్ధ ప్రాతిపదికపై దేశద్రోహ చర్యలు అరికట్టాల్సిన బాధ్యత ప్రభుత్వంపై ఉన్నది.

టి.టి.డి. ఫండ్స్ రోడ్లు, డ్రైనేజి మొ॥ లౌకిక కార్యక్రమాలకు వాడడం వెంటనే మానివేయాలి” అన్నారు.

– (మా.వి)

ఆంధ్రవీరులు

# ఆంధ్రకేసరి

(గతసంచికతరువాయి-7)

- రాష్ట్రకవి డా॥ ఓగేటి అచ్యుతరామశాస్త్రి

స్వారాజ్యోద్యమ పూర్వవృత్తములు దేశాంతస్థచారిత్రముల్
ఆరాదీయుచు పోవుచుండగ మదిన్నాశ్చర్యముప్పొంగునా
సారాంశంబును బ్రస్తుతించుటతగున్ సంకేతమాత్రంబుగా
నారంభింతును కొన్ని సంగతులనాహ్లాదించి యోచింపగన్

ఎనయ ''పద్దెన్మిదొందలయేబదేడు'' విప్లవంబదివిఫలమైవీఁగెఁగాక
పాలితులు మాత్రమేగాదు; పాలకులును నేర్చుకొనిరయ్యపాఠముల్ నిక్కువముగ.
సాగదింకజబర్దస్తిసాగదనుచు, నింగిరీజులు గ్రహియించి రిదినిజంబు!
సక్రమాందోళనంబదిసాగవలయు, ననుచుఁదలచిరి హిందువులనుటనిజము!

దాని ఫలితంబుగా నొక్కదారితోచె, కాంగ్రెసనుసంస్థయేర్పడెఁగాలగతిని
వారువీరునుఁదమతమ స్వార్థబుద్ధిఁబ్రోదిచేసిరి దానిని స్ఫూర్తితోడ
అరయనాంగిలేయులత్యంత చతురులు, సదరు సంస్థలోని సభ్యులందు
ప్రజల హితముకొఱకుఁబనిఁజేయుదిట్టల, భ్రమలుఁజూపి తృప్తిఁబఱచు చుండ్రి

అట్లు పెరిగివచ్చు నాసంస్థయందున, స్పష్టమైన నొక్కసంజ్ఞలేక
వారుతృప్తిఁబఱుప వీరు తృప్తిబడుచు, కాలసరణివెంటఁగదలుచుండ్రి
కాలగమనమందు కాంగ్రెసుసంస్థలో, వేరు కూటములవియేఱుపడియె
మించువేడ్కవారు మితవాదుల తివాదు,లను చుఁబిలువబడిరి యనగ నొప్పు.

మితవాదులకుఁదాను మేటినాయకుడయ్యె, గోఖలే యనునొక గొప్పవ్యక్తి
అతివాదులకుఁదాను నగ్రనాయకుడయ్యెఁ, దిలకు నాబడునొక్కధీరవరుడు
స్వారాజ్యలక్ష్యంబుసాధింపబగలదృష్టిగోఖలేలకు నఱకొఱగనుండె
స్వారాజ్యలక్ష్యంబు సాధించుదీక్షయే తిలకుల గుండెలఁదిష్ఠవేసె
దిక్కులన్నియు మార్మ్రోగి పిక్కటిలగఁ, దిలకు గర్జించెనీగతి దిటవుతోడ
జన్మభూమి ''స్వరాజ్యంబు జన్మహక్కు''-తిలకు తిలకంచు జైజైలు దిశలమ్రోగె!

మహారాష్ట్రమందునమహనీయుడౌబాలు, పంజాబునందునవరలులాలు
వివిధరాష్ట్రములందు విప్లవకారులు, బెంగాలునందున బిపినపాలు
ఆదిగాఁగల్గిన యతివాదనేతలు, దేశమందంతటఁదిరిగి తిరిగి
స్వారాజ్యభావముల్పాదుగొల్పుచునుండ, జైజైలు పలికిరి జనులు వహవ!
కానిగోఖలె తిలకుపైఁగక్షగట్టి, కొన్ని కేసులనిఱికించి కొంచెపఱచి
కష్టపెట్టెనటంచుఁబ్రకాశమపుడు, విన్నమీదట మిక్కిలి విస్తుబోయె!

పూనా పట్టణమందున, తానుగ నాతిలకునతడు దర్శించుతఱిన్
మానుగనాతనివలనను, జ్ఞానము సమకూర్చునట్టి గాథలనెఱిగెన్
హిందూధర్మమునందలి, సుందరమగు మూల సూత్రసూక్ష్మాంశములన్
గందరగోళములేకయె, బంధురహృదయంబుతోడ బాగ్రహించెన్

అప్పుడు కాం(గ్రెసునందున, చెప్పగ గోక్లేల మాట చెల్లుచునుండన్
ఒప్పనియాం(ధ్రులకేసరి, చిప్పున నాసంస్థయందు చేరకనుండెన్
తిలకు గోఖలేల తేడాలుయట్లుండ, సంస్థలక్ష్యహీనసంస్థయగుట
కంటగింపుగలిగికాం(గ్రెసుసంథలో, (శ్రీ(ప్రకాశమపుడు చేరడయ్యె!

ఇంగ్లండులో తాను యెలమిబారిష్టరీ, చదువు చుండిన తఱిఁజక్కగాను
అచటివారి స్వేచ్ఛనారసి మనదాస్య, భావంబునకుఁజాల బాధపడియె
దేశదేశాలలోఁదీం(డ్రించిసాగిన, స్వాతం(త్ర్యసం(గ్రామ చరితలరసె
(బ్రిటనులోని మనదుపెద్దనేతల తోడ, పరిచయ బాగ్యంబుఁబడసియొప్పె
స్వీయదేశంబునకుఁదిర్గిచేరుకొనుచు, పెద్ద (ప్రాక్టీసు చేయుచు పేరుఁబొందె
రాజకీయమ్ములందునఁ(గమముగాను, చొరవజూపించి మన్ననల్ చూరగొనియె!

సూరతు కాం(గెసునందున, నారాసవిహారి ఘోషుయధ్యక్షుడుకాన్
వారకతిలకులు దానిని, వారించిరి ధ్యేయనిష్ఠ బాహాబాహిన్

సూరతు కాం(గెసు శూరభూమిగ మాఱె, నతివాదమితవాదయహము వలన
అతివాదులొక కొంతయణగారినట్లైరి, మితవాదులాయిరి మేఁటి మగలు
ఏకోనవింశతియేడవయేడులో సూరతు కాం(గెసు చొప్పుజరిగె
పందొమ్మిదొందల పదిహేను పరిధిలో గోఖలే గతియింపకొఱత మిగిలె
తిలకు మహారాజవర్గముతేరుకొనియె, ఉద్యమంబున కొక కొంత యూపిరాడె
(ప్రజలు స్వాతం(త్ర్యదీక్షతో రగులుచుండె తిలకు మహరాజు జై! యంచు దిక్కులదరె!

లోకమాన్యతిలకులోక సం(గ్రహవృత్తి, కొఱకు జీవించిన గొప్పనేత
మహారాష్ట్రకేగాదు; మరిదేశమంతకు, మకుటంబులేనట్టి మాన్య విభుడు
హిందవీజాతీయ హిత భావసంపదఁ(బజలకందించిన (ప్రబలశక్తి
మాండలేజైలు లో(మ్రగ్గి వచ్చినయట్టి, (ప్రథమనాయకమణి, (గ్రంథకర్త
తనకు ముందటి పిమ్మటి తరములందు, కాగడా పట్టి వెతకిన కానరాడు
అట్టినాయకుడింకను పుట్టఁబోడు, యనుచు పలికిన నాశ్చర్యమందనేల!

పద్దెన్మిదొందల పైన తొంబదిమూడు వత్సరంబదియప్టువరలుచుండె
చెన్నపట్టణమందు "(శ్రీ బిల్లిగిరి" యనునయ్యముగారింటనప్పుడతడు
(శ్రీవివేకానంద(శ్రీదర్శనముఁజేసి టెలిపతీవిషయాలటీకనెఱిగె
జ్ఞానికసాధ్యంబు కానరాదిలయంచు (శ్రీవివేకుడు చెప్పఁజిత్తమలరె

అతని హర్యక్షసౌందర్యమారఁజూచి, యూయుపన్యాసరసధిలో నాదమఱచి
నూతనోత్తేజమందిన నేతయనగ, (శ్రీ(ప్రకాశము రాజిల్లెఁజెలువుమీఱి.

పందొమ్మిదొందల పదమూఁట (బ్రిటనులో, వెస్టుమినిష్టరువీటియందు
పాలెసుహోటల్లో పాశ్చాత్యదుస్తుల, గాంధీని తొలిసారిగాంచెతాను
పందొమ్మిదొందల పదిహేడులోఁదిర్గి, కలకత్తా కాం(గెస్లోగాంచెనతని
గుడ్డబొందుల చొక్క, గుజరాతి తలపాగ, వేషంబులోఁజూచివిస్తుబోయె
ఈ శతాబ్దమందు నిరువదిపిమ్మటఁదిలకు వారసుడయివెలుగునింపె
ఉద్యమంబుతోడనుర్వినియూగించి, వరలె గాంధి దివ్యపురుషుడనగ!

ఇట్లు తొలుతనతడు యిలవివేకుని గొల్చి, పిదపతిలకు చరణ పీఠి(వాలె
అవలగాంధిగారి యడుగుల నడచుచు, వృత్తివదలెనతని (పేరణమున!

(సశేషం)

చింతనం

# ఇండియాలో ఇంటింటా మతయుద్ధం ముంచుకొస్తున్న ప్రమాదం

– డా. కసిరెడ్డి

మన సనాతన ధర్మం, వేదాంత విజ్ఞానం, హిందూ సంస్కృతి ఎంతో గొప్పది; ఇది అనాది నుండి ఉంది; దీనికి క్షతిలేదు; చ్యుతి లేదు–అని అంటుంటే వింటుంటాం. ఇది ఆశావాదం.

అయితే గాలిలో దీపంపెట్టి దేవుడా నీవురక్షించు అంటే దీపం ఉంటుందా! ఆ దేవుడు నిన్ను హిందువుగా పుట్టించి ఈ ప్రపంచంలోకి పంపింది ఎందుకు! గాలిలో దీపం పెట్టమనా! దీపం వెలిగించింది గాలిలో పెట్టడానికి కాదని ఆదేవుడే చెప్పాడుకదా! దీపంగాలికి ఆరిపోకుండా నీ అవసరాన్నిబట్టి గదిలో పెట్టుకోవాలి. చేయి అడ్డంపెట్టి వెలిగించిన దీపం వెలుతురు నీవుచేసే కార్యక్రమాలకు దారి చూపేదిగా ఉండాలి. నీవుచేసే కర్మకు దీపమనే జ్ఞానం దారిచూపిస్తుందన్నమాట. కర్మయోగానికి జ్ఞానయోగాన్ని అండగా తీసుకోవాల్సిందే! తప్పదు. ఇది దేవుని నిర్ణయమే.

కర్మ చేయకుండా, జ్ఞానాన్ని అండగా తీసుకొనకుండా కొందరు బతుకుతుంటారు. అలాంటి బతుకు బతుకుమని దైవం నిన్నిక్కడికి పంపలేదు.

సరిగా ఇలాంటి మాటలే తమకరపత్రాల్లో ప్రచురించి ఈ దేశంలో క్రైస్తవ మిషనరీలు తమమతాంతరీకరణ కార్యక్రమాన్ని జెట్ వేగంతో పెంచాయి.

'' ఇండియాలో ఇంటింటా మతయుద్ధం చేయాలి. ప్రతి ఇంటిలో ఆత్మ క్షోభిస్తున్నది. ఆ ఆత్మలను విముక్తంచేయాలి. 1996వ సం॥లో 1940 ఆత్మలను విముక్తంచేశాం. బాప్టిస్మమిచ్చి ఈ ఆత్మలను పరిశుద్ధం చేశాం. ప్రతి ఇంటిలోని ఆత్మమనలను పిలుస్తున్నది. విముక్తి కొరకు ప్రయత్నంచేయడం మనపవిత్రకర్తవ్యం. ఇందులకు పరిశుద్ధాత్ములైన మన కిరస్తానీ ప్రచారకులు పూనుకొన్నారు. ఒక ప్రచారకునికి నెలకు 1750రూ॥లు ఖర్చు అవుతుంది. ఈ కరపత్రం మీకు అందగానే ఇట్టేడబ్బు పంపించండి! ఇండియాలోని ఇంటింటి ఆత్మలవిముక్తి కొరకు ఈ డబ్బు సద్వినియోగమవుతుంది. మీరు చెక్కుల రూపంలోగాని, నగదురూపంలోగాని ఈ క్రింది చిరునామాకు పంపండి!

మన ఈ ఆత్మల విముక్తి కార్యక్రమమును ఆటంకపరచవలయునని కొందరు యత్నము చేయుచున్నారు. వారిని దేవుడు చూసుకొంటాడు. మనం ప్రార్థన చేస్తాం; దేవునిపై విశ్వాసముంచుతాం. దేవుడే వారిపనిపట్టగలడు. మనం మాత్రం ఇండియాలో ఆత్మల విముక్తికే ప్రయత్నంచేయాలి. ఇండియాలో ఇంటింటా ఇది క్రూసేడ్‌గానే (మతయుద్ధంగానే) భావించి ప్రయత్నం గట్టిగా చేయాలి. ఇది దేవుని కార్యమే సుమా!''

ఇదండీ ఆకరపత్రం సారాంశం. ప్రతి యింటిలో మత యుద్ధంచేయాలని విదేశీ కిరస్తానీల మిషనరీలు పిలుపునిస్తుంటే స్వదేశీయుడేంచేయాలి. నేను పనిచేస్తాను; తింటాను; పండుతాను; సినిమాలు చూస్తాను; షికార్లు గొడతాను; జీవితమంటే ఇదే అని ఇవాళహిందువు వ్యవహరిస్తే–మతయుద్ధం పేరిట ఇంటింటికీ ముంచుకొనివచ్చే ఈ ప్రమాదాన్ని ఆపేదెవరు?

మన ప్రభుత్వం గుడ్డిది. దానికి సెక్యులరిజమనే పెద్దరోగం పట్టుకొంది. అది సంతృప్తీకరణ విధానం అవలంబించి ఓట్ల దిక్కే చూస్తుంది తప్ప మతాంతరీకరణాల ప్రమాదం దిక్కు చూడదు.

విదేశీకిరస్తానీలు విద్యపేరిట, వైద్యంపేరిట, సేవాకార్యక్రమాల పేరిట హిందువులను ఆకర్షించే ప్రయత్నం చేస్తున్నాయి. డబ్బునూ–విలాసవస్తువులను స్వేచ్ఛగా వెదజల్లుతున్నాయి. ఈ దేశంలో క్రైస్తవాన్ని పెంచేసి, రోమ్‌చర్చిమతం క్రింద ఈ దేశం ఉండేట్టుగా తీవ్రంగా మతాంతరీకరణాలు–ప్రచారాలు ప్రారంభించాయి. భారతదేశాన్ని కిరస్తానీ దేశాల బానిసగా మార్చాలనే అవి మతయుద్ధాన్ని ఇంటింటా చేయాలని పిలుపునిస్తున్నాయి. ఇదేమిటన్ని ఏ హిందువైనా అడిగితే భారత ప్రజాస్వామ్యం మాకు స్వేచ్ఛనిచ్చింది అంటున్నాయి ఈ మిషనరీలు.

హిందువులకూ మఠాలున్నాయి; మందిరాలున్నాయి; శుద్ధి సభలున్నాయి; పునరాగమ కేంద్రాలున్నాయి. వీటిలో కొన్ని ప్రమాదాన్ని గుర్తించి పనిచేస్తున్నాయి. కాని విదేశీమిషనరీలను వ్యూహాత్మకంగా ఎదుర్కొనే యోజన వీటికి లేదు. విదేశీకిరస్తానీలు స్త్రీలను ప్రయోగిస్తారు; డబ్బు ప్రయోగిస్తారు; కొన్నివస్తువులను కానుకగా ఇస్తారు; మందులిస్తారు; బట్టపాతలిస్తారు; విదేశాల్లో

ఉద్యోగమంటూ భ్రమలు కల్పిస్తారు. అది అగ్నిలా మండుతూ వస్తుంటే హిందువు శలభమై అందులో పడుతున్నాడు.

ఇది ఇలాగే కొనసాగితే! నీతెలుగు, కన్నడ, మలయాళ, మరాఠి, ఒరియా, తమిళ, గుజరాతి, హిందీ, పంజాబి, బెంగాలీ, కొంకణి, నేపాలి, ఏభాషా ఉండదు. నీ గుడీబడీ ఏదీ ఉండదు. నీకు స్వాతంత్ర్యమే ఉండదు. మతం మారితే జాతీయతే మారి... పరాయిదేశానికి ''గులాంగిరి'' చేయాల్సిన దుస్థితి ఏర్పడుతుంది.

ఇది ఇంటింటా మ్రోగుతున్న ప్రమాద ఘంటిక కాదు. వ్యక్తి వ్యక్తి దగ్గర అనుక్షణం మ్రోగుతున్న చర్చిఘంట. ఈ నినాదాల ఉచ్చులో ఇరుక్కోకుండా హిందువు ఏంచేయాలో ఆలోచించాలి.

1. ఇంటింటా హిందూధర్మ ప్రచారం మొదలుపెట్టాలి.

2. '' ఆత్మవత్సర్వభూతాని'' అన్న ప్రధాన సిద్ధాంతాన్ని ప్రచారంచేయాలి.

3. హరికథల, పురాణాల, ఆధ్యాత్మిక ప్రసంగాల వేగం పెంచాలి.

4. ఊరూరా నిరాడంబరంగా యజ్ఞాలు ప్రారంభించాలి.

5. తమకులంలోని ఒకవ్యక్తి కిరస్తానీ అయితే ఆకులం పెద్ద అతణ్ణి కలిసి, తులసినీళ్ళుత్రాపి, గీతచదివించి ఓగుడిలో పునరాగమనం చేయించాలి.

6. ప్రభుత్వ ఆస్పత్రుల్లో కిరస్తానీలు చేసే ప్రార్థనల వెనుక ఉన్న నక్కటక్కుల్ని-నయవినయాల్ని-దొంగాటకాల్ని బహిర్గతం చేసి ఎండగట్టాలి.

7. ఒక కిరస్తానీ హిందువుతో స్నేహంచేస్తున్న అంతర్యమేమిటో పసిగట్టాలి.

8. హిందువుకు ఇది ఒక్కటే మాతృభూమి. అందుకే ఇది విదేశీ కిరస్తానీల చేతిలో పడకుండా కాపాడుకోవాలి.

9. కిరస్తానీల పరిపాలనలో భగత్సింగు, మంగళపాండే, రాజగురు, సుఖదేవ్, చంద్రశేఖర్ ఆజాద్ తదితరులను ఎంతక్రూరాతి క్రూరంగాచంపారో యువతకు వివరించాలి. మన్యంవీరుడు అల్లూరి సీతారామరాజును ఎలా చంపారో వివరించాలి. ప్రపంచంలో వారిచరిత్రనిండా రక్తపు మరకలే ఉన్నాయన్నది గుర్తుంచుకోవాలి. ''శాంతి'' అనే మాటవెనుక క్రూరమృగంపొంచి ఉన్నదనేది గ్రహించి లోకానికి వివరించాలి.

10. వ్యభిచారం చేసైనా సరే మతం మార్చు అనే నీతి చర్యలకు కిరస్తానీలు దిగుతుండడాన్ని నీచాతినీచమైన చర్యగా ఖండించాలి.

11. ప్రతి హిందువురోజూ రెండునిమిషాలైనా గీతచదువాలని ప్రచారం చేయాలి. చదువురానివారు దేవుని విగ్రహానికి దండం పెట్టుకోవాలి.

12. హిందూత్వ వికాసం కొరకు తనవంతు యోగధ్యానాన్ని అందించాలి.

13. మనగుళ్లమీద, బళ్లమీద విదేశీ గూండాలు దాడిచేయకుండా శక్తిని సముపార్జించుకోవాలి.

14. ఊరూరా హిందూభజన సంఘాలు, సేవాసంఘాలు ఏర్పాటుచేయాలి.

15. హిందువుల ఉత్సవాలు సక్రమపద్ధతిలో నడుపుకొనే శిక్షణ ఇవ్వాలి. ముఖ్యంగా గణేశ, శ్రీరామనవమి, విజయదశమి ఉత్సవాలప్పుడు యోజనాబద్ధంగా వ్యవహరించాలి. అశ్లీల గీతాల కేసెట్లు వేయరాదు. పిచ్చి పిచ్చి ప్రదర్శనలివ్వరాదు.

16. హిందుత్వంలోని ఔన్నత్యాన్ని- ఔదార్యాన్ని బోధించే సాంస్కృతిక కార్యక్రమాలు సమాజం వేదికల మీద, గుడుల ప్రాంగణాలలో ప్రదర్శించాలి.

17. మన ఔదార్యాన్ని విదేశీయుడు బలహీనతగా భావించినప్పుడు, సంఘటితశక్తితో ముందంజవేయాలి.

18. ఎన్ని భాషలు, ఎన్ని కులాలు, ఎన్ని వర్గాలు, ఎన్ని వర్ణాలు ఉన్నా పూలదండలో దారంలో మనందరినీ కలిపేది హిందుత్వమే అని గుర్తుంచుకొని ప్రచారం చేయాలి.

ఇది స్వకార్యం; స్వామికార్యం; దేశకార్యం; దైవకార్యంగా భావించి, కొంత సమయాన్ని కేటాయించి హిందుత్వ పరిరక్షణకు నడుంకట్టుకొని నడవాల్సి ఉంది. హిందూధర్మప్రచారం ప్రతిహిందువు పవిత్ర కర్తవ్యంగా భావించి వ్యవహరించాల్సి వుంది.

# లేఖ

ఆర్యా!

1) ''అర్థశతాబ్ది ప్రజాప్రభుత్వం'' శీర్షికలో డిశెంబరు'96, ఏప్రిల్'97 సంచికలలోని తిరుపతయ్య గారి విచారణ చాల బాగున్నది. ''విశ్వహిందూ'' విచారణ విశ్వమంతా ప్రచారమయినా ప్రభుత్వానికి ప్రచారం కాదు. నాయకులపేరిట చలామణి అవుతున్న దేశద్రోహులను క్రిమినల్స్‌గ నిర్ధారణ చేసి సుప్రీంకోర్టు శిక్షించేవఱకు ప్రజలు ఎలక్షన్లను బాయ్‌కాట్ చేసేవిధంగా విశ్వహిందూ పరిషత్ ప్రజలను మేల్కొల్పాలి. పళ్ళూడగొట్టే రాళ్ళే అన్ని పార్టీలు. ఈ పార్టీలన్నీ ప్రజాపాలనకు పనికిరావని ప్రజలు పట్టుపట్టాలి. అప్పుడు దేశానికి సౌభాగ్యం ఊహకైనా రావచ్చును.

2) పెరిగిన చెట్లను నరకుట క్రిమినల్‌గ పరిగణిస్తున్నది ప్రభుత్వం. పెరిగిన గోవులను చంపుటకూడ అంతే. గోహత్యనేరం క్రింద కొన్ని క్రిమినల్‌కేసులు బుక్‌చేస్తేగానీ 1977 ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం జారీచేసిన చట్టం గుఱించి న్యాయస్థానం యొక్క ఆలోచనకు రాదేమో!

3) ఢిల్లీలో జరిగిన సప్తమధర్మసంసద్ తీర్మానాలలో సినిమాలు ప్రజల ధార్మిక జీవనాన్ని కలుషితం చేస్తున్నవనీ, సినిమావారు స్త్రీని భోగవస్తువుగ నీచపరుస్తున్నారనీ ఒకానొక తీర్మానం. ఇది అక్షరాల సత్యం. లంచాలుతిని ఇటువంటి సినిమాలను ఆమోదించే ఫిల్మ్‌సెన్సార్‌బోర్డువారికీ, ఇటువంటి సినిమాలను తీసే ప్రొడ్యూసర్-డైరెక్టర్లకూ విశ్వహిందూ పరిషత్ తరపున వార్నింగ్‌లు ఇవ్వాలి. క్రిమినల్ కేసులు బుక్‌చేస్తే ఉత్తమం. వీరందరు తమ భార్యలను, అక్కచెల్లెళ్ళను, కూతుళ్ళను యీవిధంగ పబ్లిక్‌గ తెరమీద విడువగలిగితే అప్పుడు వాళ్ళకేసుకు క్షమాపణ, లేనిపక్షంలో పెనాల్టీక్రింద విశ్వహిందూ పరిషత్ యొక్క ధార్మిక కార్యక్రమాలకు కొన్ని లక్షలరూపాయలైనా విరాళం చెల్లించి ఆసినిమాలను banచేయాలి. సెన్సార్‌బోర్డు తరపున భారతప్రభుత్వంకూడా ఈ పెనాల్టీని చెల్లించాలి.

దుండగులైన ప్రజలకేనా ఈ ప్రజాప్రభుత్వం, ధార్మిక ప్రజలకు ప్రజాప్రభుత్వం వర్తించదని ప్రజాప్రభుత్వపు థియరీలోగానీ, భారత దేశ రాజ్యాంగంలోగానీ ప్రత్యేక అంశం ఏమైనా ఉన్నదా?

ఓం తత్ సత్ — శ్రీ కృష్ణా నందమఠం స్వామి

---

**వార్తలు :**

మార్కాపురంలో 15-2-97న వి.హిం.ప. నగర సంపర్క ప్రముఖ్ శ్రీపాలువాది శేషయ్య పరమ పదించగా పరిషత్ కార్యాలయంలో సంతాప సభ జరిపి వారికుటుంబానికి సంతాప సానుభూతాలు తెలిపారని శ్రీ సంజీవయ్య తెలిపారు.

---

ఒకోరకమైన జంతువుకు ఒకోరకమైన గుణములూ, ఒకోరకమైన ఆహారనియమాలు ఉన్నాయి. కాని మానవునికి అన్ని జంతువుల ఆహారలక్షణాలు, అన్నిరకాల మానసిక లక్షణాలు ఉన్నాయి. మానవుడు పుట్టగానే ఏడుస్తాడు. ఏజంతువూ పుట్టగానే
ఏడవదు - కొంతసేపటికే లేచి నడవగల్గుతుంది కూడాను.

సేకరణ : మా॥ సుబ్బరాయుడు
ధవళేశ్వరం.



రాష్ట్రగవర్నర్ గారికి గోవధ నిషేధానికై చట్టం చేయాలని మెమోరాండం సమర్పిస్తున్న
**శ్రీ జి.పుల్లారెడ్డి - శ్రీగుండేరావు** గార్లు.



**'భారతి'** గ్రంథావిష్కరణ చేస్తున్న నేషనల్ ప్రొఫెసర్ **శ్రీరామరాజు**, వారికుడివైపు రాష్ట్ర కవి **డా॥ ఓగేటి**, ఎడమ వైపు కళాప్రపూర్ణ **డా॥ పోతుకూచి**, ప్రక్కన రచయిత **పింగళి**